# సరస్వతీ బుక్ డిపోవారి స్టేజీ నాటకములు

బళ్ళారి ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారివి.

| | |
|---|---|
| చిత్రనళీయము | రు 1-8 |
| విషాద సారంగధర | 1-8 |
| పాదుకా పట్టాభిషేకము | 1-6 |
| ప్రమీలార్జునీయము | 1-2 |
| ప్రహ్లాద | 1-2 |
| చంద్రహాస | 1-2 |
| బృహన్నల | 1-2 |
| మోహినీ రుక్మాంగద | 1-2 |
| పాంచాలీ స్వయంవరము | 1-2 |
| ముక్తావళి | 1-2 |
| చిరకారి | 1-2 |
| సావిత్రి చిత్రాశ్వము | 1-2 |

బళ్ళారి డి. గోపాలాచార్యులు గారివి,

| | |
|---|---|
| రామదాసు | రు 1-4 |
| రామకబీర్ | 1-4 |
| సుభద్రార్జునీయం | 1-2 |
| ప్రేమచంద్రయోగి అను అస్పృశ్య విజయం | 1-2 |

బళ్ళారి పండిత కె. సుబ్రహ్మణ్య శాస్త్రి గారిచే రచియింపబడినవి.

| | |
|---|---|
| సంపూర్ణ మహాభారతము | రు 1-4 |
| కృష్ణ లీల | 1-4 |
| లవకుశ | 1-4 |
| మేవాడ శౌర్యాగ్ని | 1-4 |

బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారివి

| | |
|---|---|
| సత్యహరిశ్చంద్రీయము | రు 1-4 |
| సాత్రాజితీయము | 1-0 |
| బుద్ధిమతీవిలాసము (శ్రీయాళ) | 1-4 |
| ఉత్తర రాఘవము | 1-2 |

ఆకెళ్ళ సత్యనారాయణ కవిగారివి

| | |
|---|---|
| జయంతజయపాలము | రు 0-12 |
| తెనాలిరామకృష్ణ (చిం॥సో) | 0-8 |

కాళ్ళకూరి నారాయణరావు గారివి

| | |
|---|---|
| చింతామణి | రు 1-4 |
| మధుసేవ | 1-2 |
| పద్మవ్యూహం | 1-2 |
| చిత్రాభ్యుదయం (సారంగధర) | 1-0 |

ముత్తరాజు సుబ్బారావు గారివి

| | |
|---|---|
| శ్రీకృష్ణతులాభారము | రు 1.4 |
| కచదేవయాని | 0-12 |
| రణతిక్కన | 0-12 |
| భక్తమార్కండేయ | 0-12 |

పానుగంటి లక్ష్మీనరశింహారావుగారివి

| | |
|---|---|
| కల్యాణ రాఘవము | రు 1-2 |
| వనవాస రాఘవము | 1-4 |
| విజయరాఘవము | 1-4 |
| పాదుకా పట్టాభిషేకము | 1-4 |
| విప్రనారాయణ | 1-4 |
| రాధాకృష్ణ | 0-12 |

వలయువారు:— కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్,

ప్రొప్రయిటర్సు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

శ్రీ

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

ఇది

స్వరాజ్యరథము, తాజ్‌మహల్, దానవీరకర్ణ, సతీఅనసూయ, ప్రతాపరుద్రీయము, అదృష్టవిజయము రచించి ప్రఖ్యాతివహించిన దేశముఖు, దేశపాండ్యా


## సోమరాజు రామానుజరావు గారిచే


రంగూను, ఆంధ్రజాతీయ నాటకసభకై రచియింపబడినది.




ప్రకాశకులు :

## కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు : సరస్వతీ బుక్కు డిపో, బెజవాడ (కృష్ణాజిల్లా)

రెండవ కూర్పు 500

తెనాలి లక్ష్మీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడెను.





1943

[వెల రు 1-0-0

# ఇందలి పాత్రములు



## పురుషులు

1. శంకరుడు—కథానాయకుడు
2. విష్ణువు—వైకుంఠపతి
3. బ్రహ్మ—సత్యలోకేశ్వరుడు
4. నారదుడు—(నాటక సూత్రధారి) దేవఋషి
5. భృంగి-శంకరుని యనుచరుడు
6. ఇంద్రుడు—దేవపతి
7. బలిచక్రవర్తి—రాక్షసరాజు
8. అశ్వినీదేవతలు—దేవవైద్యులు
9. సాగరుడు—ఒక కుష్ఠురోగి
10. భగీరథుడు—ఒకరాజు
11. భగీరథుని అనుచరులు
12. బుద్ధిసాగరుడు—భగీరథుని మంత్రి
13. దేవతలు
14. రాక్షసులు
15. విఘ్నేశ్వరుడు—పార్వతీ పుత్రుడు



## స్త్రీలు

1. పార్వతి—శివుని రాణి
2. గంగ—కథానాయిక.
3. మోహిని—విష్ణువుఅవతారము
4. పార్వతిచెలికత్తెలు.
5. మాయామోహినులు.

☛ ఇన్ని పాత్రలున్నను 12 మందితో ప్రదర్శింపవచ్చును.

## హెచ్చరిక

శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

## ప్రథమాంకము

### ప్రదేశము - మందాకినీపరిసరము

[ప్రవేశము—చెలులతో పార్వతీదేవి]

(అనుబంధము ౧.)

పార్వ—చెలులారా ! ఇది మందాకినీపరిసరము.

మ. ఇది మందాకిని నిర్మలాంబువులతో నింపారఁగాఁ బారు చో
టిది మౌనీంద్రజనార్చ్య పావనతరం బీ దివ్యతాకోటి క
య్యది పాపఘ్న పవిత్రభూమి; కనుమీ యొప్పైన తత్పర్ణశాల
ప్రదతోయంబులఁ బుంగాలాడిన నఘప్రారంభ మీడేరెడున్.
అహా ! ఇది యెంత పవిత్రమగు ప్రదేశము !

సీ. జలజలనుత్తుంగశైలాగ్రములయుగంబు
నఁ బరఁ బారెడు పావనస్రవంతి
తనివారఁ బ్రసరించి, ధరణిదాకిన హేమ
గుచ్ఛసంయుతలతాకుంజములును
మహోన్నతానూన బహువిధశైలాగ్ర
మభ్రచుంబితమయూసంతగణము
హాయిగా పురివిచ్చి యానందమున నటియించి
వారిని గ్రోలు మయూరసమితి
విమలశుభ్రప్రకటశిలావేదికలును
శిరము లెత్తక మేసెడు హరిణచయము
మునిజనసమాశ్రితావనితలంబు
గలిగి యీ చోటు ప్రకాశమయ్యె.

నే నీమందాకినీజలంబులందు జలావగాహము సలుపునంతలోన మీారు
పూజాయుక్తములగు పుష్పములను సేకరింపుడు పొండు.
చెలు—భాగ్యము. (నిష్క్రమింతురు )
పార్వ— (అనుబంధము ౨.)
(స్నానోద్యుక్తయగును.)
( తెరలో)
పార్వతీ! సాహసింపకుము! సాహసింపకుము! త్రింశత్కోటిదేవతా
గణంబుల కాధారభూతమైన మత్పావనజలం బశుచియ్యాత
వగు నీకు స్నానార్హము కాదు.
పార్వ—ఎవ్వరు నన్ను జలావగాహమునుండి వారించువారు?
గంగ—(ప్రవేశించి) భవాని! సాహసింపకుము!
క. నా తనువు దేవకోటికి
పాతకహరణంబునే డపావని వీవో
శీతనగజాత! నీ వి
ట్లాతురపడనేల? మానసాదులు లేవే!
ప్రథమమున నెంద్రైన స్నానం బాచరించి పిదప నాయం దవగాహ
నంబు సలిపితి వేని యుభయమంగంళబగు.
పార్వ—(ఆశ్చర్యపడి) ఏమి యీావిచిత్రము! ప్రపంచోత్పన్నమైన
దాదిగా నింతదనుక నన్ను వారింప సాహసించినవా రొకరుం
గానరారే! నే డిదియెంతచిత్రము! (ప్రకాశముగా) ఓ జలాధి
దేవతా! నీ వెవ్వతవు?
గంగ—భవానీ! నన్ను మందాకిని యని పిలతురు. త్రిదేవులం దొక
తెవై పరమపవిత్రీభూతవగు నీ కిది యర్హ కార్యముగాదు.
వెనుకకు మఱలుము.
పార్వ—ఓసి యజ్ఞానురాలా! ఏమి నీప్రలాపము! త్రిపురాంతకుని
యర్ధాంగినై, దేవీత్రయమునం దగ్రగణ్యనై, చతుర్దశభువన
జననభరణహరణములకుం గారణభూతనైన, నన్ను నిరాక
రింప నీవెంతటిదానవు. గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించె ననిన

చండమున సమస్తజగద్బహిరంతస్స్వరూపిణినగుననా నీవుజలా
వగాహమునుండి వారించుట! చాలు చాలు నూరకుండుము.

గంగ—(తనలో) ఏమియిది!—నాసాధువాక్యములను గర్వశీలయగు
నీ శాంకరి యెంతమాత్రమును సరకుచేయక మేరమీరి వాదం
బున కియ్యకొనఁ జూచుచున్నది. కానిమ్ము; ఈ వాదము
ముందెట్లుగాఁ బరిణమించునో చూచెదఁగాక! (ప్రకాశముగా)
పార్వతీదేవీ! ఆగ్రహింపకుము. భవన్మాహాత్మ్యము నెఱుంగని
దానఁగాను. ఐనను ప్రపంచారంభమాదిగా ఘూనభోజనం
బఖిలంబును న న్నిట్లే మన్నించుచున్నారు.

(అనుబంధము 3.)

పార్వ—ఓ ప్రగల్భవాక్కుశలుసాలా! చాలింపు మింకనీగర్వభాష
ణము. ఈ పార్వతిసామర్థ్య మించుకేనియును నీ వెఱింగి యు
న్నట్లు కానరాదు. ప్రళయకాలంబున ననంతకోటి బ్రహ్మాం
డముల నే మదీయవిశ్వాకారంబునముంచి లయింపజేయుదునో
యామదీయకాళికావతారముం దిలకించి జ్ఞానబోధితవుగమ్ము.

సీ. విలయకాలంబున జలరాశినై లోక
జాలంబు మాయించు శక్తి నేను
విపరీతగతిమీర విశ్వభీషణకేళి
నవరించు తాండవ శక్తి నేను
కృతయుగంబున శాంకరీదేవినై మహో
జ్వల దానవులద్రుంచు శక్తి నేను
కాలగర్భాంతర హేలాగతిక్రమీరి
జగము ద్రిమ్మరుమృత్యు శక్తి నేను
జగములకు నెల్ల నాధారశక్తి నేను
ప్రకృతిశక్తిని నేను శాంభవిని నేను
సదమలామేయచైతన్యశక్తి నేను
దివిజవాహిని నా శక్తి దెలియవేమొ!

(పార్వతి శక్తియై కనఁబడును.)

గంగ—(చేతులు జోడించి) దండకము

శ్రీమన్మహాదేవదేవీ! మహాశక్తి! కాత్యాయనీ! విశ్వవిశ్వావతారీ! ప్రపంచప్రభాసర్వచైతన్య సంధాయకీ లోకమాతా నిలింపాధినేతా మహాశక్తిదాతా భవద్దివ్యమాహాత్మ్యము న్నేడు కన్నార గన్నాను మన్నాను తల్లీ! మదీయాఘజాలంబు పూర్ణంబుగా మాసె జన్మంబు ధన్యత్వమున్ జెందె మాన్యత్వమున్ బొందె ముమ్మార్గు లంగన్నయమ్మా! కృపం గాంచుమమ్మా! భవన్నాసినమ్మా! నతుల్ సేతునమ్మా! శివాంగానుషంగా యుమా పావనాంగా నమస్తే నమస్తే నమః॥

పార్వ—(యథారూపమును దాల్చి) గంగా! యిప్పటికయిన మత్ప్రభావజ్ఞాన మలవడినదా?

గంగ—దేవీ! నీ మాధుర్యము నెడల నాకు వెనుకటికన్న నెక్కుడుగ నవ్వు వచ్చుచున్నది.

పార్వ—ఆఁ! ఎందుచేత?

గంగ—సీ. స్తవనీయమహిళవౌ జననిరో నీకింత
తామసభావంబు తగునటమ్మ
శీలరక్షిణివి విశ్వేశ్వరి వనఘునీ
యాత్మ స్తవంబు నీ కర్హమమ్మ
సారెకన్యులఁ దృణీకారంబు సల్పు నీ
గర్వంబు బలఁతిబుద్ధి గాదటమ్మ!
ఎల్లలోకములకుఁ దల్లివౌ నీవిట్లు
సలుప లోకము లాగజాలవమ్మ!
విశ్వనాథుని దార నీవిశ్వమునకు
జనని వీభావనము నీకు జనునటమ్మ!
సకలలోక మంగళములు సలుపుకొనుటకు
పోరుసలుపక వెనుకకుఁ బోగదమ్మ.

పార్వ—(ఆగ్రహముతో) ఓసీ! తరతమజ్ఞానవిహీనా! నీ కన్నులకీ పార్వతి యన్న నెంత తేలికగాఁ గాన్పించెను! మతిలేని దేవతలందఱును జలాశచే నీకొనరించిన పూజనములు నీ కెం

తగా తలకెక్కెను! నన్ను నీ జలంబులం దవగాహనంబు సలు
పనిచ్చెదవా లేదా?

గంగ—అట్లు సలుపనీయకున్న నేమి చేసెదవు?

పార్వ—శపించెదను.

గంగ—ఇచ్చట నీ శాపంబునకు భీతిల్లువారెవ్వరు? ఇంతటి తామస
బుద్ధిగల నీకు తప్పక ప్రాయశ్చిత్తము కావలసినదే. నే నే
నీకు సవతినై, నీ పతిశిరం బెక్కి తాండవం బాడి నీ గర్వ
మణంచకున్న నా పేరు మందాకిని కాదు.

(అనుబంధము ౮.)

పార్వ—అట్లయిన నీజలంబులం జొరనీయవుగా?

గంగ—చొరనీయను.

పార్వ—ముమ్మాటికి?

గంగ—ముమ్మాటికి.

పార్వ—అట్లయిన మదీయ భీషణశాపమున నీవిప్పుడే నామావశేష
మయ్యెదవు.

గంగ—నీ శాపములకొఱకు కిందు వేచియుండువారెవ్వరు?

(అనుబంధము ౯.)

(జలములతో నంతర్ధానమగును.)

పార్వ—(భ్రాంతి నంది) ఔరా! నేనెంత వెకలినైపోయితిని! దుష్ట
మతియగు గంగ నన్ను తృణప్రాయముగ నొనరించి సంభా
షింపుచుండ నే నెట్టి జడమతినైతిని. ఎట్టయెదుట దాని నర
కాల రాచి నామావశేష మొనరింపనైతినిగదా! ఏమేమీ!
ఈ గర్విష్ఠియా నా మదమణంచుట! ఈ పాపినియా నాపతి
శిరం బెక్కుట! ఈ వృథాప్రగల్భకుశలయా నాకు సవతి
యగుట! ఎంత తూలనాడినది! ఎంత పెద్దపిన్న తారతమ్య
ము లేక మాటాడినది! పార్వతియన్న నేమనుకొనెను?
మహిషాసురుని నిర్వీర్యుని గావించి తదుధిరాస్వాదనప్రమత్త
తం గేళీవిహార మాచరించిన సాక్షాచ్చండికారూపిణినగు నా

పైననా యీ జలదేవత తనప్రతాపముం జూపసాహసంచు
నది! ఇందుల కేది వెరవు! ఇప్పుడే ప్రతిక్రియ గావింతును!
(చెక్కిట చేయిఁజేర్చి ఆలోచించుచుండును.)

[నారదుఁడు ప్రవేశము]

నార— (అనుబంధము ౬.)

(స్వగతము) పుట్టించినవాడు భోజనంబు పెట్టకమాన డనునర్థమును
నే నాత్మానుభవమునం దెలసికొంటిని.

ఆ. బండలోననున్న మండూకములకును
నండముల జెలంగు పిండములకు
భుక్తినొసగునట్టి భువనేశుడే కల
హాశనంబు నొసగి యరయు నన్ను.

నేఁ డేకలహంబున నారదుండనగు నాకడుపు నిండునో, యిప్పటి
కింకనుఁ దెలియరాదయ్యె!

సీ. కల్పింతునా చిన్నకలహంబు నేదేని
హిమశైలతనయా మహేశ్వరులకు
పుట్టింతునా చిన్న పొలయలక నేదేని
యిందిరావైకుంఠమందిరులకు
సవరింతునా చిన్న జగడంబు నేదేని
ముందుపౌలోమీపురందరులకు
కలిగింతునా చిన్నకయ్యంబు నేదేని
శారదానిగమవిశారదులకు
జుట్లు ముడివెట్టి చూతునా సురల కెల్ల
కొఱవిలే నగ్గిఁగాల్తునా కుతలములను
తగఁబ్రదర్శింతునా చమత్కారమునను
బ్రకటితంబైన కలహనాటకము నొకటి.

(పార్వతిం బరికించి) ఓహో! ఏమిది! పార్వతీదేవి క్రోధకషాయవద
నయై యిందే నిలువఁబడి యున్నది. ఒకవేళ మత్సంకల్పాను
కూలంబగు కలహనాటకంబున కీమె నేపథ్యమేశ్వరుఁడొకముఖ్య

పాత్రనుగాఁ బంపెనేమో తెలిసికొందును. (ప్రకా.)తల్లీపార్వ
తీదేవీ! బాలుఁడగు నారదుఁడు నమస్కరించుచున్నాడు.

పార్వ—ఓహో! నారదా! అన్యాయత్తచిత్తంబున నిన్నుఁ జూడ
నైతిని. నీకుఁ గుశలమా?

నార—నాకుశలమున కేమిగాని, తల్లీ!—

మ. అలరుంజెక్కిట చేయిఁ జేర్చి యరుణంబై యున్న నెమ్మోముతో
నలకల్ చిందరవందరై భుజములం దట్టిట్లు జీరాడ శే
వల ముద్రాకృతిదాల్చి యన్యవిషయ వ్యాలోలతంజేసి స
త్కలహాసంబును మాని పూనఁదగునే? తల్లీమనఃక్షోభముల్.

పార్వ—నారదా! నావిచారమున కేమిగాని, నీవిప్పు డెక్కడనుండి
వచ్చుచుంటివి? [వచ్చుచుంటివి.

నార—నా కొక్కచో టనుమాట యేమి? త్రిలోకములు దిరిగి

పార్వ—నారదా! నీవు దివిజవాహినియగు గంగ నెఱుఁగుదువా?

నార—(స్వగ) ఈ పార్వతి గంగపైననే క్రోధమూనిన ట్లున్నది.
ఈ తరుణమున నే నాల్గువేడిసమిధలు తగిలించి కలహాగ్నిని
రవులొల్కులుపుటకు నాకు మంచితరుణము. (ప్రకా) అమ్మా!
మీరాకుటిలగమనను, దివిజవాహిని యని పెద్దజేయుచున్నా
రేమి! అడిగితిరి గావున తద్గంగోదంత మెల్ల నాలకింపుడు.

సీ. వంకర యగు దుష్ప్రవర్తనం బొనరించు
పారుబోతుగుణంబు వదలదెపుడు
నిమ్నోన్నతంబులే నివసించు భూములు
బహుప్రజాపతులదా ప్రాపకంబు
కొలిచినవారల కొంపఁ జెగ్రమింగు
రూప మొక్కవిధాన దోపరాదు
అది యిది యనక నాహరించు సకలంబు
కట్టుపుట్టములేక గాసినందు
అరయ దానికి బుద్ధి యెక్కడిది స్వర్గ
మందజేయును పాపాత్ము లైనవారి

దాని వయసా తలంప మందాకిని గద!
త్రాగుబోతులు మొక్కుకు పెన్వాగుగాదె.

పార్వ—అబ్బా! అంతమాత్రమునకేనా యాతంత ప్రతినలు పట్టినది.

నార—(స్వగ) నేనిప్పుడొనరించిన గంగావర్ణన మంతయు నీపార్వతీదేవి నిందయనియే భావించుచున్నది. (ప్రకా) అమ్మా! ఎంతంత ప్రతినలు పట్టినది!

పార్వ—నాపతి శిరము నెక్కి తాండవంబాడి నాకు సవతియై నా గర్వమణంచునట!

నార—అబ్బా! ఎంత నిర్లక్ష్యముగఁ బలికినది! అట్లయిన నిక్కముగా నీమె గర్వమణంచవలసినదే! కాని పార్వతీదేవీ! ఇందొక్క దేవరహస్యము మాత్ర మిమిడియున్నది. తమవంటివారి కది యొక గొప్పవిషయము కాదు గాని, చిన్నపాము నేని పెద్ద కఱ్ఱతోఁ గొట్టవలెను గదా!

పార్వ—ఇంతకు నీవు చెప్పదలచిన విషయమేమి?

నార—ఒకవేళ మీకును గంగకును, నిజముగా నన్యోన్యస్పర్ధయే కలుగు నేని, ముక్కోటివేల్పులు నాగంగపక్షమునబడిచత్తురు. ఏమి కారణముననో కాని, మందాకినీ యనిన వారి కమంద ప్రీతి. ఏమికారణమో యననేల? ఇది లేనిచో వారు నీటి చుక్క లేక మలమల మాడుదురు.

పార్వ—ఎంత వెఱ్ఱివాడవు నారదా! వేల్పులకెల్ల వేల్పగు పరమేశ్వరుఁడే నాపతియైయుండ నీచచ్చు వేల్పుల లక్ష్యము నాకేమి? నాకావల కొంచెము పనియున్నది. పోయివచ్చెదను. (నిష్క్ర)

నార—(పకపక నవ్వి) భళిభళీ! చక్కనికలహము సంప్రాప్తమైనది. భాగీరథి యొకరి ననవే యనదు. అనినా అన్నంతపనియుఁ జేసితీరును. ఐనను గర్వమతియగు నీ పార్వతి కొక్కమారు గట్టి ప్రాయశ్చిత్తము కావలసినదే! ఈలోపల నేనొకమారు మందాకినినిగలసికొని సాంత్వవచనముల నూరడించివచ్చెదను.

(అనుబంధము. 2) (నిష్క్రమించును.)

---

శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

## ద్వితీయాంకము

### 1 వ రంగము

[ఒంటరిగ సాలోచన యగు గంగ ప్రవేశము]

(అనుబంధము ౮.)

గంగ—(స్వగ) కటకటా! కుడిచి కూర్చుండ లేక దురంతమగు ప్రతిజ్ఞాభారమును శిరంబున నిడికొంటిని. దీని నెరవేర్చుకొను నుపాయ మెట్లోకదా!

ఉ. పర్వతరాజపుత్రి కపుత్రభూష స్వయంబుగ నామె భర్తయగు
శర్వుడు లోకభీకరుఁడు సర్వసురాసురకోటి యామెకై
పర్వమటంచు సాయముగ వత్తురు; నాదెస తోడు లేదు దు
ర్గర్వముచే నుమాసతినిఁ గారులు ప్రేలితి మోసపోయితిన్.

ఈ చతుర్దశభువనంబుల నెందు వెదకి చూచినను నాకు పార్వతికన్న నెవ్వరు సన్నిహితబంధువులు!

సీ. అహిరాజునకు శరణార్థి నౌదమటన్న
నాతఁడు హరుని కంఠాభరణము
ధనదుని పాదపద్మములు వేఁడుదమన్న
భర్గున కాతండు ప్రాణహితుఁడు
పర్వతేశ్వరుని ప్రాపకముఁ గోరుదమన్న
శర్వాణి కాతండు జనకుఁ డగును
నలువపదాబ్జాతములు గొల్తమన్న శం
కరుడు శిరము ద్రుంచు పరమభీతి

ఎవరు గాచువార లెవ్వారు హితులు నా
కాథ వానికన్న నఖిల జగతి
ప్రాణరక్షణంబు పదునాల్గుజగముల
లేదు నాకు బ్రదుక నేదిదారి.

[నారదుండు ప్రవేశము.]

నార— (అనుబంధము ౯)

గంగ—త్రిలోకసంచారియగు నారదమునీంద్రునకు నమస్కారము.

నార—చింతితకార్యసిద్ధిరస్తు. గంగా! నీకును పార్వతికిని జరిగిన వాగ్వాదమెల్ల నే నింతకుమున్నే పార్వతిముఖంబున వింటిని.

గంగ—ఏమి! పార్వతిముఖంబుననా ?

నార—ఔను. ఐననేమి ?

గంగ—మీపలుకులవలన నామె నాపైమిగుల మాత్సర్యముం బూనియున్నట్లు తెలియుచున్నదిగదా!

నార—"ఇంటిపేరు కస్తూరివారు; ఇల్లు గబ్బిలముల కంపట" ఈ త్రిదేవుల సంగతి యట్లున్నది.

గీ. పతిముఖం బెక్కగా యొక్కవదరుబోతు
ధవుని సామేననెక్కె భైరవియొకర్తు
నాథు రొమ్మునఁనెక్కె చంచలయొకర్తు
సాధ్వులా వీరు; కడు జగజంతలమ్మ!

నీ వీత్రిదేవుల ప్రతాపమున కీషణ్మాత్రమేని భీతినందఁ బనిలేదు.

గంగ—దేవమునీంద్రా! త్రిదేవు లెట్టివారైనను, పామునుపట్టుకుమును పడగ విరోధము నుండదుగదా! శాంకరి నాకహితయైె, శంకరుండుమాత్ర మెన్నడైన హితుఁడగునా?

నార—గంగా! భక్తపరాధీనుఁడగు శంకరుని మతమును నీవెఱుంగవు స్తుతిపాఠముల కుబ్బి తబ్బిబ్బగు వెఱ్ఱిజంగమయ్య.

గంగ—ఐనను పార్వతి యీవఱకే సర్వోదంతమును తననాధునకెఱింగించి నాపై నాగ్రహమును గలిగింపక యుండునా ?

నార — అట్లయిన భక్తపరాధీనుఁ డగు కమలామనోహరుఁడు నీకుఁ బ్రసన్నుఁ డగును. నావెంట వైకుంఠమునకు రమ్ము.

గంగ — అతఁడుమాత్రము మిత్రకార్యమున వ్యతిరేకముగఁ బ్రవర్తిల్లునా?

నార — నీ కాసంశయము లేల? కార్యభారమును నాయందుంచి నా వెంటరమ్ము.

గంగ — భాగ్యము.

(అనుబంధము ౧౦.)

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## 2-వ రంగము

భగీరథుని దర్బారు

[ప్రవేశము — పరిజనులతో భగీరథుడు.]

పరి — (అనుబంధము ౧౧.)

భగీ — మంత్రీ! బుద్ధిసాగరా! మొన్న మనపైకి దాడివెడలివచ్చిన కాశ్మీరరాజుసేన లెట్లు పలాయితములై పోయెనో చూచితివి గాదా!

బుద్ధి — దేవా! అందులకు సందేహ మేమి?

గీ. త్వత్పరాక్రమకథ చెవితాకినంత
భవదరిచమూసమూహంబు బారకున్నె
చండకిరణప్రదీప్తిప్రసారమైన
నంధకారము జగమున నాఁగఁగలదె?

భగీ — ఇది యంతయును విశేషించి నీ బుద్ధిబలముపై నాధారపడియున్నది సుమా?

బుద్ధి — దేవా! భగవంతుఁడు సకలభువనసంరక్షకుఁడయ్యును భూభారవహనయశంబుమాత్రము శేషునియందును దిగ్గజములయందును నాదికూర్మమునందును నిలిపినట్లు కించిజ్ఞుడ నగు నన్ను పెద్దజేయుచున్నారు.

భగీ—స్తుతినభిలషింపని నీసద్గుణములచే నిప్పుడు నిజముగా నీవు బుద్ధిసాగరుఁడవై ప్రకాశించుచున్నావు.

(తెరలో వీణాగానము.)

భగీ—పరిజనులారా ! బ్రహ్మమానసపుత్రుఁడగు నారద మునీంద్రుఁ డుకాఁబోలును మన యాస్థానమున కరుదెంచుచున్నవాఁడు. మనమందఱ మెదురేగి, యా దేవర్షిసత్తమునిఁ దోడ్కొని వత్తము రండు.

(అందరు నెదురేగి నారదుని దోడ్తెత్తురు.)

భగీ—దేవమునీంద్రుని పాదపద్మములకు శిరస్సాష్టాంగప్రణామములు.

నార—చింతితకార్యసిద్ధిరస్తు !

భగీ—దేవా ! మీరాక రాకవోలె మా కానందప్రదమయ్యె. ఈ మణిపీఠం బలంకరించి, మమ్ము ధన్యాత్ములం జేయుఁడు.

నార—(కూరుచుండి) రాజేంద్రా ! రాజులం దగ్రగణ్యత వహింపగల నిన్ను దర్శించి మే మెంతయుఁ గృతార్థులమైతిమి.

భగీ—మహాత్మా ! సామాన్యనరపాలకుండ నగు నన్ను తమరు విశేషించి కీర్తించుచున్నారు.

నార—రాజేంద్రా! సామాన్యనరపాలుఁడవా నీవు! నీపూర్వభూమీశుం డగు సగరనృపుడు మఖాశ్వంబును వదలుటయును, తదనుగమ్యమానులై చనిన సగరపుత్రులు కపిలాగ్రహంబున భస్మీభూతులగుటయు జగద్విదితవృత్తాంతములుగావే నరపాలతిలకా !

క. మీతండ్రి దిలీపుడు మీ
తాతయు నంశుమంతుం డుదారచరిత్రుం
డాతనితండ్రి సగరనృపుఁ
డాతతయశులయ్య ! పూర్వులందఱు నీకున్.

ముఖ్యముగా నిపుడు నేను నీపితృదేవత లందుచుండిన బహువిధనరక బాధాపరంపరలను నరకలోకమునం గాంచి వారి యాదేశ

మున నీకు హితము నుపదేశింప భూలోకంబునకు వచ్చితిని
(అనుబంధము ౧౨.)

భగీ—మునీంద్రా! నాపూర్వులు యమలోకప్రాప్తులై దురంతయాతనల ననుభవించుచు, తమ్ము గాపాడవారలేక మించిన యాత్రిని విలపించి దిక్కులు చూచిచూచి నిరాశచే తల్లడిల్లి తమ వంశీయుల మగు మమ్మెంత దూషించి శపించిరో గదా!

(అనుబంధము ౧౩.)

మిత్రులారా! వింటిరిగదా యీ విపరీతవార్త! నా పితరుల యార్తి బాపలేని నా జన్మమేల కాల్పనా?

(అనుబంధము ౧౪.)

మ. యమబాధాహతులై నిరంతరఘనాయాసంబునుంజెంది దు
ర్భ్రములై వేసరి యాత్మవంశజుల శాపాలాప మొల్లాడిరో
యమరేశా పగదెచ్చి దుస్థితుల సత్యంతంబుబోకార్చి, వే
గమె నా పూర్వుల నుద్ధరించు వెరపుం గల్పింపుమా నారదా!

నార—భగీరథా! విచారింపకుము! కమనీయ నదీమతల్లియగు గంగామతల్లి నీపూర్వుల భస్మరాసులపై యథేచ్ఛం బ్రవహించునేని వారు నరకబాధావిముక్తులు కాఁగలరు. గంగాభవానిని నభోతలమునుండి భూతలి కవతరింపఁజేయుము. ఈ గంగావతరణ మహాయశంబు నీకు దక్కనున్నది.

క. పితరుల వెత తొలఁగఁగ నం
కితముగ ధృతిఁజెలఁగుగతి, భగీరథ నీవుల్
పతితాభయహితరంగన్
గతకల్మషఁ దెమ్ము భువికి గంగ నభంగన్.

భగీ—మహాప్రసాదము. దాసుఁ డనుగృహీతుఁడు.

నార—రాజేంద్రా! నాకు తడవయ్యె పోయివచ్చెద.

భగీ—చిత్తము.

నార— (అనుబంధము ౧౫.) (నిష్క్రమించును.)

భగీ—వినయశీలా! నాదరమునియాదేశమును మీ రందఱును విం

టిరిగదా ! ఇది నా కింక జాలముసేయదఁగిన సమయముకాదు. కావున నా హితమాలకింపుము.

సీ. దేవతాఖిలభూమి దేవతాజనపూజ
లిరవుగాసల్పు చేమరకుమయ్య
సంధ్యవేళల నాదు జనయిత్రిపదముల
కిరవుగా గురుభక్తి నెరగుమయ్య
అరసి గృహాగతులగు సాధుజనులకు
ప్రీతితో పూజ గావింపుమయ్య
కులవృద్ధులను ప్రీతిఁగొల్చి పూర్వాచార
విధులను క్రమతఁ గావింపుమయ్య !
యలతపోవనినుండి గృహాంతరమున
కేను చనుదెంచునందాక, మానితముగ
సామమున శత్రుతతితోడ సంప్రదించి,
పురము నత్యంతశ్రద్ధతో నరయుమయ్య !!

పరిజనులారా! గంగాభవానిని స్తుతించుచు మీరు నన్ను పురబహిః ప్రదేశముదనుక సాగనంపుఁడు. నే నిదే తపోవనమున కరుగుచున్నాను. (అనుబంధము ౧౬.)

అందరు—జయ్ ! గంగాభవానికీ జయ్ !

(అందఱు నిష్క్రమింతురు)

---

## 3 వ రం గ ము

భగీరథుని తపోవనము

భగీ—(గంగాధ్యానము చేయుచుండును.)

(అనుబంధము ౧౭.)

తల్లీ! కల్లోలలక్ష్మీరాజితకాశమల్లీ! బహుఫుల్లతరంగవై, పుణ్యాదితరంగవైన నీ దయారసంబున మత్పితృదేవతలు భవత్పావనజలాభిషిక్తులై తరియింపవలయునని, భవత్పాదారవిందములకు పునః పునఃప్రణామముల నాచరించుచున్న వాఁడ తల్లీ ! దేవనదీమతల్లీ!

మ. పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపఃపారీణు లార్యుల్ మహా
పురుషశ్రేష్ఠులువచ్చి, తల్లి! భవదంభోగాహము శ్రేయఁగా
నరసంఘాఘము నిన్నుబొందునె జగన్నాథుండు నానాఘసం
హారుఁడౌ విష్ణువు వారిచిత్తములఁ దానైయుంట మందాకినీ.
(గంగ ఆకాశమునుండి దిగును.)

భగీ— (అనుబంధము ౧౭.)

గంగ—పరమపావనమనోరథ! భగీరథ! ఈ నీ తపంబు మిగుల వ్యర్థమైనది. ఏమంటివేని,

మ. వినువీధిం బర తెంచి నేలఁబడ నా వేగంబునున్ నిల్ప జా
లినవాఁ డెవ్వఁడు సాంద్రసుందరజటాళిన్ నన్ను బంధించి, మె
ల్లన శీర్షంబునదాల్చి భూమిపయి వీడంజాలు నచ్ఛక్తి భా
జనుఁడై యొప్పిన నీలకంఠుని తపశ్శక్తిం బ్రపూజింపుమా!

నన్ను తన దృఢతరజటాజూటంబున ధరించి సముభూములబ్రవహింపఁ జేయఁగల సమర్థు డాగరళకంఠుఁ డొకఁడే. కావున నాతనిఁ బ్రార్థింపుము.

(అనుబంధము ౧౮.)

భగీ—ధన్యోస్మి! తల్లీ అట్లే కావించు వాఁడ!

క. మావారిభస్మరాసులు
నీవారిం గలపుకొనుము నెరిమావారల్
నీవారిఁ గలయ నాకము
మావారికిఁ గల్గునిది ప్రమాణము తల్లీ!

దేవీ! నీ సుందరాకారసందర్శనంబున నాకుఁ దృప్తి గలుగకున్నది. పవిత్రమగు నీమకరవాహనావతారము నొకఁమారు గాన్పింపఁజేసి, నన్ను పవిత్రునిఁ జేయుము.

గంగ—భగీరథా! అట్లే యగుగాక!

(గంగ మకరవాహనారూఢయై కనఁబడుచున్నది.)

భగీ— (అనుభంధము ౨౦.) (తెరవ్రాలును.)

---

శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

## తృతీయాంకము

### 1 వ రంగము

[వైకుంఠమున శ్రీభూదేవులతో డోలికాంతరమున నూగుచు శ్రీమహావిష్ణువు కనఁబడును.]

గంగ— (అనుబంధము ౨౧.)

(సీను మారి అంతఃపురమగును.)

విష్ణు—(భూమినుండి పైకివచ్చును.)

గంగ—(పాదములకు నమస్కరించి) దేవా! కనులామనోహరా! భవదీయదర్శనంబున మత్పాపంబులు సకలంబునుఁ బటాపంచలయ్యె! నా జన్మము చరితార్థముం గాంచె,

సీ. ఎవని దర్శనము బ్రహ్మేంద్రాదులకు మునీం
  ద్రులకైన నెంతైన దుర్లభంబు
ఎవని మహానంద మీజగజ్జాలంబు
  ధన్యంబొనర్పఁ జైతన్యసమము
చెలువారు నెవనియక్షీణకారుణ్యంబు
  పరసుధాకరసుధావర్ష ధార
ఎవ్వని కనుమూత యీప్రపంచములకు
  విలయ కాలాద్భుతాభీలవేళ
  యేమహాత్ముని పలుకులు సామవేద
  ఘోషణంబులు మంజులభాషణములు
  అట్టి లోకైకమిత్రు మహానుభావు
  శ్రీమహావిష్ణుఁ గంటి నాచింతదీర!!

దేవా! మహానుభావా! అసమంజసమును, నసుల్లంఘనీయంబు నంతి క్రమణీయంబును నగు భవానీశాప్రతవమహానలంబున భస్మీ మసియైపోవనున్ననాకు నీసహాయంబు సమస్తాధారంబులునై పరిరక్షించె.

విష్ణు—కుమారీ! నీవింక నిశ్చింతవై యుండుము. భవానీప్రతాపము నీయందింక పనిసేయజాలదు ఆగర్వమతికిఁ దగుపరాభవం బనతికాలంబునఁ గానైయున్నది. మున్నొకమారు కొండొక కారణంబున నేను కైలాసంబునకరుగ నన్నుఁ దృణీకరించిన చందమున నీపార్వతి, తనపతి యర్ధశరీరమునుండి లేవదయ్యె. తత్కారణమున, నామెకుఁదగిన సవతింగూర్చి తద్విరోధముం దీర్చుకొన సంకల్పించితిని.

క. నాసంకల్పము నేటికి
నీసాహసమూలమునను నిలచెను గానన్
భాసురముగ నాయంబనుఁ
జేసెద నీసవతిగాఁగ చిరము కుమారీ!!

గంగ—జనకా! అజ్ఞానంబున నెఱుఁగక పార్వతితో నప్పుడేమంటినో కాని, తమదర్శనమైనంతనుండియు నాహృదయమున నైహిక చింతలెల్ల దూరీకృతంబులై మధురమకరందరసోత్పాదకమగు భవత్పదపద్మముల నంతర్గతనై సుఖానుభవమందఁ గోరుచుంటిని.

విష్ణు—గంగా! నీవందుల కేమియు విచారమునందఁజనదు. నాప్రియ పుత్త్రిక వగునిన్ను నాప్రియమిత్రుఁడగు శంకరునకిచ్చికల్యాణ మొనరించి యానందమొందెదఁ గాక! అంతదనుక నీవు నీ యిచ్ఛానుసారముగ నా పాదంబుల నంతర్గతవై యుండుము.

గంగా—భాగ్యము. (తెరలో)

మహాత్మా! జగన్నాథా! తమదర్శనమునకు చతుర్ముఖఫాలనేత్రులరుదెంచి దర్శన మపేక్షించుచున్నారు.

విష్ణు—సరే! వారిని సత్వరము ప్రవేశబెట్టుము......గంగా! ఫాల

నేత్ర పద్మగర్భులు రాకమున్నే నీవు నాపాదంబులం దణగి పొమ్ము.

గంగా— (అనుబంధము ౨౨)

(విష్ణుపాదములఁ బ్రవేశమగును)

[శంకరుఁడు—బ్రహ్మప్రవేశము]

శంక—క. కమలేక్షణ నీకై లో
కము గనుగొనుచున్న దాశ కనుమూయనిదై
శమియింపఁజేయవే! లో
కముల యవస్థలను నీవు కారుణ్యనిధీ!!

బ్రహ్మ—గీ. అమరలోకనది యదృశ్యమైనకతన
నిర్జలక్షోభ మిపుడు జనించెనయ్య!
నిఖిలలోకరక్షణము మానినను సరియె
ఘనజలక్షోభ మిపుడు మాన్పినను సరియె.

విష్ణు—శంకర పద్మసంభవులారా! ఏమి యీతీవ్రము!

బ్రహ్మ— మహాత్మా! ఏమని చెప్పుదును?—గంగాజలంబు లదృశ్యములైనకతమున, త్రావ జలంబులు లేక లోకంబులు తల్లడిల్లుచున్నవి. ఇందులకై కొండొకమార్గముంజూప నీకన్న నెవ్వరు సమర్థులు?

విష్ణు—చతురాస్యా! గంగానది హేత్వంతరములచే మదీయపాదముల నణగియున్నది. తగుసమయము వచ్చునందాక తద్గంగ బహిర్గతయగుట సంభవింపదు. వలయునేని మీరు గంగాజలంబును మీకమండలముల గొనిపొండు. తత్కమండలోదకమే త్రిలోకముల కాధారంబగును.

బ్రహ్మ— }
శంక — } భాగ్యము.

విష్ణు.— (అనుబంధము ౨3)

(శంకరుఁడు బ్రహ్మ గంగోదకములంగొని నిష్క్రమింతురు.)

---

శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

## చతుర్థాంకము

### 1 వ రంగము

[రాక్షసులతో బలి ప్రవేశము.]

(అనుబంధము ౨౮.)

బలి — దానవులారా! దేవేంద్రుఁడు మదోన్మత్తుఁడై యేపుమీరి తన దేవసేనలంగొనివచ్చి మనలం బరాభవించిననాటిచరిత్ర మీ హృదయంబుల జాగరితమగుచుండుట లేదా?— గురుండగు శుక్రునియానమైనది గావున, నేడే మీరందఱును దండయాత్రకు బయలుదేరవలయును.

సీ. అమరావతీపురోత్తమ కుడ్యభాగముల్
చెదరి పాతాళంబు జేరవలయు
పాపకర్మురలైన పరిపంథిదేవతల్
మేరుభూధరగుహల్ దూరవలయు
బంతులవలె దేవపతులమూర్ధంబులు
తెగినభూతలమున నెగురవలయు
నిర్జరీస్తనవక్షోజనిస్తులాక్రాంతచే
లాంచలంబులు తొలగించవలయు
విమలచింతామణీభద్రపీఠమందు
నీబలిమహాసురుండు కాలిడగవలయు
స్వర్గలోకవాసుల పరాజయముతోడ
బారదోలంగవలె మనప్రతాపంబుమీర.

[నారదుడు ప్రవేశము]

నార—బలిచక్రవర్తీ! ఎక్కడి కీదండయాత్ర ?

బలి—నారదమునీంద్రా! నన్నాశీర్వదించిపంపుము! ఇంద్రుని పద భ్రష్టుని చేయనరుగుచున్నాను.

నార—పరజయప్రాప్తిరస్తు—బలిచక్రవర్తీ! పోయిరమ్ము.

బలి—భాగ్యము.

(సైనికులతో నిష్క్రమించును)

నార—(తనలో) చక్కనిమార్గము సర్వేశ్వరుఁడు చూపినాఁడు. ఈ తులువ యింద్రుని జయింపనేవలయు. ఆ పైనగదా జరుగ దగినకార్యము జరుగును. నేనిఁక పరాజయుండు కాఁబోవు నింద్రు నోదార్పబోయెదను.

(అనుబంధము ౨౫)

(నిష్క్రమించును)

---

## 2 రంగము

వైకుంఠ ప్రాంతము

[బ్రహ్మ—ఇంద్రుఁడు ప్రవేశము]

ఇంద్రు—ఆర్య! పితామహా! ఈ నాకలోకపాలనమునకన్న నారక లోకమున సేవావృత్తి యుచితమని నాకుఁ దోఁచుచున్నది. ఏమంటివేని—

సీ. ఒకచోటనిలువగా నొనరుగానగలేక
మేరుగహ్వరములఁ దూరిదూరి
దండెత్తివచ్చిన మొండిరక్కసులకు
చిరము జోహారులు చేసిచేసి
శత్రుసేనకుజంకి సగముప్రాణములతో
దిక్కులే కడవులు దిరిగి తిరిగి
ఎచ్చోటదాగిన నేమిమున్గునో యని
ధరణీధరంబుల దాగిదాగి

నిలువనీడలేక వలువదాల్పఁగలేక
కుడువనించుకైన కూడులేక
కష్టములు భరించి కడగండ్లుగాంచి మా
వేల్పులందఱు వెతలు దెల్పదరమె?

బ్రహ్మ—బృందారకాధీశ్వరా! చింతింపకుము. వేల్పులంబాలింప సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడు బద్ధకంకణుఁడై యుండ మన కేకీడును వాటిల్లదు. అల్లదే క్షీరపారావారమత్యున్నతఫేన తరంగములతో నేత్రదృశ్యమానమై తోఁచుచున్నది. మన మా కమలామనోహరుని, రచితాంజలి పురస్సరముగాఁ బ్రసన్నునిఁ జేసికొందము.

(తెర లేవగాఁ క్షీరసాగరశాయియగు విష్ణువు కనఁబడును.)

అందరు— (అనుబంధము ౨౬)

బ్రహ్మ—దేవా! శేషశయనా!

క. పురుషోత్తమ! నీరూపము
పరమశ్రేయంబు విబుధ పంక్తుల కెల్లన్
భరియించి కావవే! ది
గ్వరుల యవస్థలను నీవు కారుణ్యనిధీ!!

ఇం— గీ. కమలగర్భ! సదానంద! విమలరూప!
చిన్మయాకార! భువన సుశ్రీనిధాన
యమరపతులకు బలిదానవాధముండు
వడయజేసెడు కడగండ్లు బాపగదవే!

విష్ణు—కమలగర్భ! శతానంద! మీ మీ కష్టంబు లణగుటకు యుక్తమార్గ మియ్యదికాదు. మీరందఱు నేకమై క్షీరసాగర మందరచితిరేని యందు మీమీ ప్రాణములను నిలువఁజాలు మహౌషధియగు నమృతం బుద్భవింపఁగలదు. దాన మీ కష్టంబులు వాయు తద్విధానం బెఱింగించెద. సావధానచిత్తులై యాలకింపుఁడు—

సీ. సకలమహా తృణలతౌషధకోటిదెచ్చి, క్షీ
రాబ్ధి తరంగంబులందువైచి
మంధరోర్వీధర మందుంచి, హితవుగా
నగణితమంథానముగ నొనర్చి
వాసుకినామ సర్పాధీశు గొనివచ్చి
తగువిధంబుగ దరిత్రాడుఁజేసి
యొకవంక సురలు వేరొకవంక దైత్యులు
వాసుకి నిరుదెసఁ బట్టినిలచి
గీ. కడలిదచ్చ బుట్టుఁ గాలకూట విషంబు
అంతలోన భీతి నందబోక
క్రమతఁ దరుచఁ బుట్టు నమృతంబు
సురలకపుడు తొలఁగు మరణభీతి.
౩౦ & బ్రహ్మ—భాగ్యము.

(తెర వ్రాలును.)

—:o:—

## 3 వ రం గ ము

క్షీరసముద్రము

[మంధరపర్వతమున కొకవంక దేవతలు వేరొకవంక రాక్షసులు చేరి క్షీరసాగరమును వాసుకి సహాయమున మథించుచుందురు.]

(అనుబంధము ౨౭.)

(మంధరపర్వతము సముద్రమున దిగబడును.)

(అనుబంధము ౨౮)

నారద—దేవేంద్రా! బలిదానవేంద్రా! మంధరోర్వీధరము క్షీరసముద్రమధ్యమున దిగబడి కదలుటలేదు. దీనిం గురుతించితిరా?

బలి—అట్లయిన నిప్పు డుపాయమేది?

నారద—మీరందఱుం గలసి శ్రీమహావిష్ణుం బ్రార్థించుటకన్న గత్యంతర మింకొకటిలేదు. ఈయాపద గడువంబెట్ట నాతఁ డొకఁడుండే సమర్థుఁడు.

బలి—ఛీ! కలహాభోక్తవైనందుల కెట్టి దుష్ప్రలాపము లాడితివి. ఆచక్రి యుపదేశమున నీ యమృతోత్పాదన కార్యమున నెవ్వరు దిగిరో వారే ప్రార్థించుకొందురుగాక! దానవుల కిందణుమాత్రముం బ్రసక్తి గలుగదు.

నార—దేవేంద్రా! ఈ మంత్రసానిగండ మెవ్వరికితప్పినను నీకు మాత్రము తప్పదు. ప్రార్థింపుము.

దేవేంద్రాదులు—(స్తుతింతురు)

(అనుబంధము ౨౯)

(విష్ణువు కూర్మావతారధారియై దర్శనమిచ్చును.)

కూర్మావతారదండకము.

శ్రీమన్మహాదేవదేవా! జగజ్జాలరక్షా! బుధానీకపక్షా! సదా దేవదక్షా! మహాక్షీణమా క్షీరవారాసిలోమున్గియున్నట్టి యీమందరంబెత్తి దేవాసురానీకలోకంబు గాపాడి రూపొందియున్నట్టి యీ నీ ద్వితీయావతారంబు గాన్పింపఁగాఁ జేసి బృందారకానీక సందోహ పాపంబు లామూలముం బాపఁగాఁ జేసి మమ్ముంగృపంజేసి కాపాడి యున్నట్టి నీదివ్యమాహాత్మ్యమున్ సన్నుతింపంగ నేనెంతవాడన్ మహా ధీరకూర్మావతారా! నమస్తే నమస్తే నమః॥ (స్తుతించును)

బలి—(నారదునిబట్టి యీడ్చి) కలహాశనుండ వగు నోజడదారీ! చాలును నీపొగడ్తలు. భట్రాజువలె స్తోత్రము లింకచాలించి దూరముగా రమ్ము. దేవదానవులారా! మీపని యింక సాగనిండు.

(మరల నందఱును సముద్రమథనము చేయుదురు.)

(అనుబంధము ౩౦)

నార—(దిశలు పరికించి) ఓహో! ఇదెక్కడి విలయానలము!

శా. భీమంబై చలదద్భుతోన్నతమహాభీభత్సకీలాభమై
ధూమప్రస్ఫుటమై చటేల్ పెటిలనాదోద్భూత విఖ్యాతమై
కామద్వేషణ ఫాలనేత్ర విలసద్గంభీరసంభూత ప్రో
ద్దామజ్వాలలతో దవానల మరో థంబయ్యె క్షీరాబ్ధిలోన్.

ఈవిపత్తుబాయు నేది వెఱవు ?

విష్ణు—బృందారకసందోహములారా! ఈవిపత్తు నడంప ఫాలనేత్రుం డొకఁడె సమర్థుఁడు. అతనిని మీరెల్లఱు ప్రార్థింపుఁడు. ఇది క్షీరసాగరసంభూతమగు మహావిషజ్వాల. దీనినీశంకరుఁడు కబళించెనేని కష్టశాంతి యగును.

శంక—ఇందిరాబంధూ! జగద్రక్షణమునకొఱకు ప్రార్థనమేల కావలయు. నీయాజ్ఞయైనఁ జాలదే !

పార్వ—నాథా! జగద్రక్షణమునకై నీవీహాలాహలపాన మాచరించి లోకరక్షణ మొనరింపుఁడు. ఎంతమాత్రము ననుమానింప వలదు.

(అనుబంధము 3౧)

నార—ఆహా! ఏమి యీ పార్వతీదేవి మనోనైశ్చల్యము !

క. మ్రింగెడువాఁడు విభుం డని
మ్రింగెడు నది గరళమనుచు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మదినమ్మినదో !

శంక—దేవదానవులారా! మీరందఱును బరికింపుచుండుఁడు. ప్రచండతరలోకసంతప్తకరంబగు నీయాభీలవిషజ్వాలల నరనిమేషమున పానంబు జేసెదను.

(అనుబంధము 3౨)

(శంకరుఁడు విషపానము చేయును.)

శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

## పంచమాంకము

### 1 వ రంగము

[కైలాసపర్వతమున భృంగి ఒంటరిగ ప్రవేశించును]

భృంగి.—"ఊరందఱును యాత్రకరిగిన నూరికాపు ముత్యాలమ్మ" అనినట్లు నన్నీ కైలాసమందిరద్వారమునఁ బడవేసి పార్వతీపరమేశ్వరులు క్షీరసాగరమథనమును నేత్రపర్వముగా దర్శింపనరిగినారు. ఫేనతరంగసమాకీర్ణమై ప్రకృతిరమ్యమై విశాలమగు నాక్షీరసముద్ర మధ్యభాగమున మంధరోద్ధరము వాసుకిచే బంధింపఁబడి త్రాటఁగట్టఁబడిన కవ్వముకైవడి నెట్లు తిరుగుచున్నదో! ఒకవంక సురలు వేరొకవంక నసురులు నిలచి యుభయపార్శ్వముల వాసుకిం బట్టుకొని యెట్లు త్రిప్పుచున్నారో చూచి యానందింపఁగలభాగ్యము నాకు లేకపోయెను గదా? (అటు నిటు జూచి) అదుగో! త్రిలోకవృత్తాంతవేదియగు నారదమునీంద్రుఁ డిటేవచ్చుచున్నాఁడు. ఇతనివలన క్షీరసాగరవార్తలు బోధపడఁగలవు.

[నారదుఁడు ప్రవేశించును]

నారద.—ఓహో! భృంగీశ్వరుఁ డొంటరిగానున్నటు లున్నాడే!

భృంగి.—నారదమునీంద్రా! దయచేసి క్షీరసాగరవార్తలేమైన నెఱిఁగించునని ప్రతీక్షించి యున్నాను.

నారద.—సురాసురులు వాసుకి నిరుదెసలఁ బట్టుకొని.......

భృంగి.—ఇప్పుడు నీవాద్యంతములు నాకెఱిఁగింపనక్కఱ లేదు. శంకరుఁడు విషపాన మొనరించిన చరిత్రముదనుక నానుపూర్వికగ

నా కఖిలవార్తలునుఁ దెలిసినవి. తరువాత వృత్తాంత మేమి జరిగినది ?

నార—తదుపరి సముద్రమథన మాచరింపగా బహుప్రయాసమున నమృతోత్పాదనమైనది.

భృంగి--ఆహాహా ! ఏమి దేవతలభాగ్యము ! అమృతోత్పాదనమే యైనచో నిజముగా దేవగణమంతయును నిర్జరగణమే యగును గదా !

నార—సరిసరి ! అంతలో నుబ్బి తబ్బిబ్బుగాకు. దిక్కుమాలిన రాక్షసులు దేవతల కాయమృతభాండమును దక్కనిచ్చి రను కొంటివా !

భృంగి---అయ్యయ్యో ! పానకములోని పుడకలవలె నీపాపరాక్షసులక్కడగూడ దేవతల కడ్డమయిరి కాఁబోలును.

నార—అడ్డమగుటమాత్రమేనా ? అమృతభాండమునే యపహరించు కొనిపోయిరి.

భృంగి—కటకటా ! ఇంకేదిగతి ! అట్టి విషమసందర్భమున జగన్నాథుఁ డగు శ్రీమహావిష్ణు వేమియు నుపాయాంతర మాలోచింప లేదా ?

నార—ఆలోచింప కేమి ? కావలసినంత యాలోచించినాడు. సురాసురులను మోహింపఁజేయఁగల జగన్మోహినీ రూపమునుధరించి యమృతభాండమును తన చేఁ జిక్కించుకొని, తొలుత దేవతలకు పంచి యీయ నారంభించినాడు. దేవతల కమృతంబు పంచి యిచ్చునప్పటికి రాక్షసుల కొకచుక్క యయినను మిగుల లేదు.

భృంగి—మేలు మేలు. విష్ణుదేవుఁ డెప్పుడును భక్తజనపక్షపాతము గలవాఁడుగదా !

నార—ఆ మేలులో కొంత కీడు నయితము పుట్టకపోలేదు.

భృంగి—మరల నది యేమి ?

నార—విష్ణుమూర్తి చేయుచున్న కపట తంత్రమును గురుతించి

రాహువు, కేతువు, అను నిరువురు రాక్షసులు దేవగణముతో పా
టుగాఁగూరుచుండి చెఱిరెండుగ్రుక్కలు నమృతమును గ్రమింగిరి.

భృంగి—ఈ యిద్దరును, మరల దేవతలపాలిటి మహామారకులై చిరం
జీవు లగుదురా యేమి ?

నార—దైవానుగ్రహమున నంతపని జరుగలేదు. ఆ యమృతబిందువు
లింకను వారి కంఠములు జారకమునుపే, సూర్యచంద్రులు
సంజ్ఞచేయ విష్ణు వాకీ లెఱింగి, వారిరువురిం దన చక్రానల
కీలలచే సంహరింప, నాదానవు లిద్దఱును గ్రహములై పర్వ
దినములయందు, సూర్యచంద్రులను గ్రసించుచున్నారు.

భృంగి—సరే! ఇప్పటి కమృతగ్రహణచరితము సాంగమైనది మా
స్వామివారు సుఖులై గృహోన్ముఖు లైనట్లేనా ?

నార—ఆహా ! పరిపూర్ణమైన వెఱ్ఱివేషముతో—

భృంగి—ఏమి నారదమునీంద్రా! నూతనవార్త నెఱింగించితివి! స్వామి
వారికి వెఱ్ఱివేష మేల ?

నార—విషపానవశమున, శంకరునకు వెఱ్ఱియెత్తినది.

భృంగి—అయ్యయ్యో ! అట్లయిన నశ్వినీదేవతలు లేరా ? బ్రహ్మాది
దేవతలు లేరా ! విష్ణుదేవుఁడు లేడా ! ఒక్కరును తన్నివార
ణోపాయ మెఱిఁగింపలేకపోయిరా !

నార—ఎఱిఁగింపకేమి ? బ్రహ్మ విష్ణు సురానీకంబు లెఱిఁగించిన
యాలోచనము పైననే, శంకరుని మంచుకొండపై నుంచిరి. అప్ప
టికి విషతాపము శాంతింపలేదు. పిదప శివునితలపై చంద్రు
నుంచిరి. అప్పటికి తాపశాంతి కాలేదు. తదుపరి, గంగను
శివుని శీర్షమున నుంచిన నీవిషతాప మణంగునని, యశ్వినీ
దేవతలు చెప్పిరి.

భృంగి—పోనీ ! అట్లుచేసినచో శాంతించియుండునేమో ?

నార—అందులకు పార్వతీదేవి పెద్ద యవరోధము చెప్పినది.

భృంగి—ఏమేమీ ! అట్లయిన పతిప్రాణములు నిలుచుట పార్వతీదేవి
కిష్టములేదా యేమి ?

నార—అదికాదు. పూర్వ మొకమారు పార్వతి గంగాజలంబులందు స్నానమొనరింప నుద్యమించినతరి గంగాగౌరులకుఁ గలహ మారంభ మగుటయు, నప్పుడు గంగ నీపతిశిరం బెక్కుదునని పార్వతితో ప్రగల్భము లాడుటయు వినియుండ లేదా ?

భృంగి—ఓహో ! అందులకా గౌరి కీపంతము ! సరిసరి ! ఈ కలహ చరిత్రము విపరీతముగనే యున్నది. ఇది యెట్లంతమగునో చూడవలెను. నే నిప్పుడు విపతాపవశమున దొరలు స్వామి వారిసన్నిధి నుండవలెను. నాకు సెలవిమ్ము.

నార— (అనుబంధము ౩౭.) (ఇరువురు నిష్క్రమింతురు)

---

## 2-వ రంగము.

ఉద్యానవనము

[మోహినీరూపమున నున్న విష్ణువు నారదుఁడు మాటాడుచుండ శంకరుఁడు ప్రవేశించును]

శంక— (అనుబంధము ౩౮)

మోహి—(లజ్జతో నిష్క్రమించును.)

శంక—(మోహముతో చూచుచుండును.)

నార—ఓహో ! దేవరవా రిందు దయచేసినారే !

శంక—నారదా ! బంగారమువంటి భార్యను సంపాదించుకొన్నటు లున్నావే !

నార—సరిసరి ! ఈ బ్రహ్మచారికి భార్యయొక్కటె తక్కువ !

శంక—కాదు. కాదు. నీవు నాతో నబద్ధము లాడుచున్నావు. అది తప్పక నీభార్యయే. నా కిచ్చి పెండ్లిచేసెదవా ! నీకు గొప్ప యుపకారము చేసెదను.

నార—ఏమి యిది ! శంకరా ! ఇంత యన్యాయముండునా ! నా భార్యయని పలుకుచు నీకిచ్చి పెండ్లిచేయుమందువా ? ఎట్టి పందయయిన నందులకు సమ్మతించునా ?

శంక—నారదా! అందేమి దోషమున్నది? "పరోపకారార్థ మిదం శరీర"మను నీతి యున్నదిగదా!

నార—ముందు కలికాలమున నెప్పుడో యట్టిపరోపకారపరాయణులు పుట్టుదురని మన పరాశరులవారనుచుండురు. నీవిప్పుడే యా నీతిని కృతయుగంబుననే ప్రచారమునకుఁ దేఁజూచుచుంటివా!

సీ. ఉద్యోగములకయి యువిదల నధికార్ల
తలిరుశయ్యలయందు దార్చువారు
కొదలేని ధనము నిచ్చెదనన్న యంతనే
వెలదిని శుంఠ కర్పించువారు
భార్యనద్దెలకిచ్చి వర్తకం బొనరించు
నాశయంబుననె పెండ్లాడువారు
సురద్రాగువెఱ్ఱికో జూదర్లయప్పుకో
ప్రియకాంతలను సమర్పించువారు
లేములకుఁ బ్రీతియున్నను లేకయున్న
బలిమినైన నన్యునిగూడ బంపువారు
పౌరుషములేని పందలు పాపరతులు
గలుగ బోవుదు రిఁక కలికాలమందు.

శంక—అబ్బబ్బ! నీ యుపన్యాసములతో నాకు చిరాకుబుట్టించుచుంటివి. ఇప్పుడు నాకు కలికాలచర్యలను వినుటకు తీరికలేదు. ఆసుందరాంగిపై నాడెందము పరువెత్తుచున్నది. నీ భార్యను నాకు గూర్చెదవా లేదా!

నార—నాభార్య కాదనుచుండగా నమ్మజాలవేమి?

శంక—పోనిమ్ము. నీభార్య కాదనియే యనుకొమ్ము. నీభార్య కాకున్నను నీకు పరిచయము కలదుగదా. ఒకటి-మారు సమాధానపరచి పంపజాలవా?

నార—సరిసరి! ఇది మరింతరమ్యముగానున్నది! శంకరా! భార్యను తార్చుపనినుండి తొలగించి, నన్ను సంధానకార్యమున బ్రవేశపెట్టితివా!

శంక—సంగతిసందర్భములు నాలోచింపవు! - ఎల్లప్పు డొకటే పరిహాసమా!

నార—ఇట్టి విపరీతపు మాటలనాడు నీవా పరిహాసములాడునది నేనా?

శంక—నారదా! ఈమాటకు ముందు త్తరము చెప్పుము. ఆసుంద రాంగి యెవ్వరు?

నార—సృష్టి కెల్ల సుందరవిగ్రహమును గల్పింపదలచి నూతనముగ బ్రహ్మదేవుఁడు సృష్టించినాఁడు.

శంక—అట్లయిన, నిఁక విచారమే లేదు; ఇది నూతనముగ వికసించిన పుష్పమన్నమాట. గనినుండి యప్పుడే తీసిన మణిపూస యన్నమాట. కాంతుఁడు లేని దీనికి నేను నూతనముగ కన్నెరికము చేసెదను. ఇందు పాపమేమి?

నార—నీ వాకాంతకుఁ గన్నెరికము చేయుమాట నట్లుంచుము. ఈ వార్త యొక్కింత పార్వతీదేవి చెవినిబడెనా యాశక్తి నీకును నాకును గలిపి యొక్కమారే పెద్దపెండ్లి చేసి తీరును.

శంక—ఆ!- పార్వతి యెవ్వతె నాయభీష్టము నాటంకపరచుటకు?— నేనాడుదాని యడుగులకు మడుఁగులొత్తు నధముఁడననుకొంటి వా? పౌరుషము లేని పంద ననుకొంటివా! స్వతంత్రశక్తి లేని చవటననుకొంటివా! ఏమనుకొంటివి నారదా!

నార—అబ్బా! నడుమ నాకు చావువచ్చినదిగదా!

గీ. విషవశంబున నిటు గంగవెఱ్ఱులెత్తి
   తికమకలువెట్టి నన్ను బాధింతువీవు
   గంగపై నీర్ష్య యధికమై కానిపనికి
   నైనపనికిని బార్వతి యాగ్రహించు.

మీయిద్దరితో నేను వేగలేకున్నాను.

శంక—ఆ! నారదా! మరల నన్ను వెఱ్ఱివాడనుచుంటివా!- నాకా వెఱ్ఱి?— అందఱకును నన్ను వెఱ్ఱివెఱ్ఱియను పెద్దరోగము పట్టుకొనినది?

నార—ఊఁ వెఱ్ఱిగా కేమి? ప్రాణము విసిగిపోవుచున్నది. ఒకగంట శాంతముగ నుందువో పదిగంటలు ప్రాణముతీతువు!

శంక—చూడు. నాకు కోపమువచ్చిన నేమిచేయుదునో -ముని ప్రముచ్చా!

నార—నాకెందులకువచ్చిన క్షోభమిది! శంకరా! నేను పోవుచున్నాను. సెలవు.

(పోబోవుచున్నాఁడు.)

శంక—అయ్యయ్యో! నాగతి యేమిచెప్పితివి?

నార—నేనేమిచెప్పినను నీకాగ్రహామే వచ్చుచున్నది! కావున నే నరిగెదను.

శంక—(ప్రేమతో) ఇదిగో! నారదా! కోపము వచ్చినదా? మాట వరుస కేదో యనుచుందునుకాని, నీపై నాకాగ్రహామేమి? నీ వాసుందరిని నాకుగూర్చవా! కూర్పకయే పోయెదవా! కూర్పకున్న నేను బ్రదుకననుసుమా!

నార—సరే! నిన్ను బ్రదికించుటకొఱకయినను, నే నీదిక్కుమాలిన యుద్యోగమున కనుమతింతుననుకొమ్ము. అందు వలన నా కేమిలాభము.

శంక—కోరుకొనుము. నీకభ్యంతరము లేదు. నాప్రాణముల నిమ్మనిన నిచ్చెదను.

గీ. పెన్నిధుల నీయఁగలను; కుబేరునడిగి
కల్పభూరుహామును కామగవియునిత్తు
సంతరించెదఫణి మణిచయమునైన
నారదా! నాకుగూర్చు మానాతి నిపుడు.

నార—నా కివియన్నియు నెందులకు?—బ్రహ్మచారిని గావున నాకు లేనిదాని నిప్పింపుము.

శంక—అబ్బో! చూచుటకు బ్రహ్మచారివేకాని, శృంగారమునకు నవమన్మధుడ వగుచున్నావే!

నార—అదిగో! నన్నిట్లు పరిహాసింతువనియే......

శంక—ఆ! ఆ! పరిహాసమాడుట లేదు—పరమానందమై పోవు చున్నది. నారదా! అట్లైన శీఘ్రముగ రంభాద్యప్సరసలను బిలువనంపెద నుండుము. భృంగీ—భృంగీ—

నార—ఆ! ఆ!—ఇప్పుడే భృంగిని పిలువకుము! నామాట రవంత వినుము.

శంక—అదియేమి?

నార—వ్రతము చెడినను ఫలము దక్కవలెనుగదా!—బ్రహ్మచర్యము పాడుచేసికొనుచు, వారకాంతలను వలతునా? శంకరా!

శంక—మరియెవ్వరు కావలెను?

నార—చక్కనికన్యయున్నచో, నుత్తమబ్రహ్మచారి నగు నాకిచ్చి కన్యాదాన ఫలము దక్కించుకొనుము. నీకాసుందరిని నిముష ములో గూర్చెదను.

శంక—ఓ అందుల కభ్యంతరమేమి? ఒకతెనుగాదు. ఎనమండుగు రను పెండ్లిచేసెదను. పార్వతి చెలికత్తెలగు బాలలు గలరు. నేనెట్లు చెప్పిన నట్లు వినువారు. భృంగీ! భృంగీ!—

భృంగి—(ప్రవేశించి) మహాప్రభో—

శంక—పార్వతి చెలులను నేను రమ్మంటినని చెప్పుము. వారిని నార దున కిచ్చి పెండ్లి చేసెదను.

భృంగి—చిత్తము. దేవరయానతి. (నిష్క్రమించును.)

నార—శంకరా!

గీ. ఎన్ని దినములనుండియో వన్నెలాడి
నొక్క తెను గూడు కోరిక నున్నవాడ
గాని యీనాఁడు భవదనుగ్రహముచేత
కాంత లెనమండ్రు సతులఁగాఁ గన్నవాఁడ.

శంక—నాయభీష్టము నెట్లు నెరవేర్తువో.

నార—నా పెండ్లియయిన వెంటనె-నీపెండ్లి చేయుదును. కాని, శంక రా! ఇందులో నింకొకమాట-ఈమాట పార్వతి వినెనా మన యిద్దరి పెండ్లి తానే చేయును.

శంక—ఈమాట పార్వతి కేల తెలియవలెను.........ఉండు—నీపెండ్లికి నేనే పెద్దనుగావున, నీ కలంకారముచేసి పెండ్లికొడుకును చేసెదను. (అలంకరించుచుండును.)

[తరువాత, భృంగియు, పార్వతిచెలులును ప్రవేశింతురు.]

(అనుబంధము 37)

చెలి—మమ్మెందుల కింగుగొని తెచ్చితివి ?

భృంగి—ఓహో! మీచర్య చూడగా మితిమీరియున్నటులున్నారే! ఒంటరిగానిని చేసి యొడ్డింపదలచిరా యేమి ?

2 చెలి—నీవు మమ్ము కడిడి కీడ్చుకొనివచ్చుటకు తగిన కారణము లేక పోయెనా నీ కీదినమున, గీతగోవింద పారాయణము తప్పదని తెలసికొనుము.

భృంగి—కాదు కాదు. నన్నంతపని చేయకుండు. మిమ్ములను నారదునకిచ్చి పెండ్లిచేయుదునని పలికి శంకరుండు వేగముగ గొనిరమ్మనెను.

3 చెలి—ఏమీ ! నారదునకా !

4 చెలి—ఆ తగవులమారివానికా ?

5 చెలి—ఆ బడుగుబాపనికా ?

6 చెలి—అట్లయిన నారదునిపెండ్లి యబద్ధము నీపెండ్లి నిజమగును. దొంగముండకొడకా చూడుమేమిచేసెదమో.

7 చెలి—మాతో పరిహాసముచేయవలయునని దుర్బుద్ధి పుట్టినదా ?

8 చెలి—ఇంకనేమిచూచెదరే! వీనికి తాళాధ్యాయము చేయుండు.

అందరు—(భృంగిని కొట్టుదురు.)

భృంగి—ఓసీ ! శంకినీముండలారా ! నన్నేటికే చావగొట్టుచున్నారు! శంకరా ! శంకరా ! చూడవయ్యా ! వీరిని వారింపవయ్యా ! నన్ను రక్షింపవయ్యా ! (పాదములపై బడును.)

శంక— ఏటికో భృంగినిట్లు చావగొట్టుచున్నారు.

1 చెలి—వీనిని కొట్టవలెనా ? చీరవలెనా ?

2 చెలి—ఆడువారితో వీనికేమిపరిహాసము స్వామీ !

3 చెలి—నారదునికిచ్చి మమ్ము పెండ్లిచేయుదునని పరిహాసించు చున్నాడు. వీనిని కొట్టెదము.

(అందఱు—అనుబంధము 3౬.)

భృంగి—చూచితిరా స్వామీ! వీరియార్భాటము! న న్నీముండలు బ్రతుకనిచ్చుట లేదు—

నార—ముండలనకోయి భృంగీ! శుభమని పెండ్లిచేసికొనదలచిన వాఁడను.

చెలులు అందరు } ఓహో! పెండ్లికొడుకు కాబోలును. హే హే హే హే హే—(నవ్వి చప్పట్లుకొట్టుదురు.)

నార—చూడుము శంకరా! నన్నుగూడ నీపలుగాకు లెట్లు పరిహాసము చేసి నవ్వి చప్పట్లుగొట్టుచున్నారో? నీవు పెండ్లి చేయుదువని యాశపెట్టుటచేత వచ్చితినిగాని, నలుగురిలో గేలిచేయింతువనుకొన నైతిని. నాకీపెండ్లి వలదు - పెటాకులు వలదు. నేను నాతంబురకొయ్య భుజమునవైచికొని తరలెదను

శంక—ఆ! ఆ! అంతతొందరపడెద వేమి? వీరిని నేను వారించెద నుండుము. ఏమే యీగయ్యాళితనము మీకు? నోరెత్తక పెండ్లియాడెదరా! త్రిశూలమును దేవలయునా?

1 చెలి—స్వామీ! మాకీముల్లరి యేమి?

భృంగి—మీపని యంతేకావలెను- స్వామీ! వీరిలో నీచిన్నదాని మీద నాకు మొదటినుండియు మోహము. దానిని నా కిచ్చి తక్కిన యేడ్గురను నారదునకు పెండ్లిచేయండి.

నార—ఓరి భండాలుఁడా!—నీవొకడవు నాకుపోటీకి వచ్చితివా! నీకడుపులో నెంతెంతయూహాలున్నవిరా! నీపొట్ట పొడిచి వేయ!

భృంగి—ఎనమండుగురు గయ్యాళిగంపల నేలుకోగలవటయ్యా?

నార—ఏలుకోలేకేమి? పిడిరాయివంటి బ్రహ్మచారిని.

శంక—నారదా! ఊరక కాలయాపన మెందులకు. సంకల్పవిధానముగా నీపెండ్లి క్షణములో సాగనిచ్చి—

నార—అదేమి? శంకరా! తద్దినమున గనవలసిన మాట నాడు చుంటివి!

భృంగి—ఈపెండ్లి నీకు తద్దినమువంటిదే!

నార—నీవు నాకెక్కడి షడ్డకుడవురా!

శంక—ఓసీ! మీరందఱు నిటురండు. మీరు గాంధర్వపాణిగ్రహణే శ్వరుఁడగు నారదున కెదురుగా నిలువఁబడుఁడు. భృంగి! నీకేమైన పెండ్లిమంత్రము తెలియునా?

భృంగి—పెండ్లిమంత్రము రాదుగాని, స్వామీ! ప్రశస్తమయిన పాముమంత్రము తెలియును.

శంక—నీ తెలివి తగులబడినట్లే యున్నది. కానిమ్ము. ఈపెండ్లికి మంత్రము లేయక్కర లేదు. పూవులదండలు చాలును. ఓసీ! మీ కెన్ని మారులు చెప్పవలెను. ఈనారదుని పెండ్లాడెదరా లేదా?

2 చెలి—మీరు మాకెంతులు కోసినను సమ్మతించెదముగాని, యీ నారదుని మాత్రము పెండ్లాడువారము కాము.

శంక—ఇదేమి నారదా! వీరి ట్లనుచున్నారు?

నార—ఇదేమి శంకరా! వీరి ట్లనుచున్నారు?

శంక—ఇప్పుడేమి చేయుదము?

నార—ఇప్పుడేమి చేయుదము?

శంక—నీవు పెండ్లికుమారుఁడవు గావున, నీ వడిగిన వీరు సమ్మతింతురు. వీరితో కొంచెము సరససంభాషణ చేయుము.

నార—నాకు సరసమేమి తెలియును? చట్టుబండలు! ఎన్నడయిన నిట్టివి యేడ్చితినా యేమి?

శంక—కొంచెము ప్రయత్నించి చూడుము. తెలియదనిన నెట్లు?

నార—ఓకాంతలారా! జగదేకసుందరులారా! జగన్మోహినులారా! (అప) శంకరా! ఇంతేనా! సరసమన్న సరిగా నిదియేనా? నేను వీరి మనస్సు కరుగునట్లు మాటాడగల్గుచున్నానా?

శంక—అట్లే మరికొన్ని ప్రౌఢవచనములు ప్రయోగింపుము. ఉడుకు చల్లారనీయకుము.

నార—(కంఠము సవరించుకొని) ఓ మన్మానసాపహారిణు లగుమానినీ మణులారా! కందర్పనిశితశతకశాఘాతంబులచే భీషణతాడితం బయిన మదీయ కోమలశరీరమును మీ మంజులకరలతాలింగ నాదులచేత— ఆప్పైన నేమనవలెను శంకరా?

3 చెలి—ఇదియంతయు సరసము కాంబోలునే! హేహేహేహే—
(నవ్వుదురు.)

శంక—(ఆగ్రహముతో) ఏమి? నాయాజ్ఞయనిన మీకు హాస్యమై పోయినదా? తులువలారా? మారుమాటాడిన చంపెదను.
(అనుబంధము 32) (శూలము నెత్తును.)

చెలులు—అమ్మా! అమ్మా! పార్వతీదేవి! చూడుము. నీప్రాణే శ్వరుఁడు మమ్ము చంపుచున్నాఁడు. (కేకలు వేయుదురు.)
(పార్వతి ప్రవేశము.)

పార్వ—ఏమినాథా యిది! మీ రందరిటకేల వచ్చితిరే! రండలారా!

చెలి—స్వామివారు మమ్మిచ్చటికి భృంగిగాని చే పిలిపించి, నారదునకు పెండ్లిచేయుదుమని బెదరించుచున్నారు. చంపెదమనుచున్నారు

పార్వ—ఏమి నారదా యీ వేషము! నీకుగూడ మతిపోయినదా యేమి? ఇంతబ్రదుకు బ్రదికి యింటివెనుక చచ్చెనన్నట్లు బ్రహ్మచారివి సిగ్గులేక పెండ్లికొడుక వయితివా! నాథా! మీయాగడము క్రమక్రమముగా మితిమీరుచున్నది. మీ రిక్కడచేయున దిదియా! మీ రందఱును మందిరమునకు బొండు. నారదా! నీచేష్ట లింకొకమారు సైరింపను. జాగ్రత్త. పొండు మందిరాంతరమునకు.
(శంకరుఁడు, చెలులు, పార్వతి నిష్క్రమింతురు.)

భృంగి—నారదా! ఇప్పుడెవమందుగురిని నీవే పెండ్లాడుము. నా కెవ్వరును వలదులే! (నవ్వి నిష్క్రమించును)

నార—అపశకునపక్షీ! నీ వెప్పుడు నా పెండ్లిలో నడ్డుమాటాడితో నీదృష్టికొట్టి యంతయు నపశకునమే యయినది.
(తెరవ్రాలును) (నిష్క్రమించును)

---

శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము

అను

# గంగావతరణము

## షష్ఠాంకము

### 1-వ రంగము

మోహిని యుద్యానవనము

(ప్రవేశము :—డోలికయం దూగు మోహినియు, ననుసరించి చెలులును)

చెలు— (అనుబంధము ౩౮)

మోహి—కల్యాణులారా! ఇఁక మీఁదట నేను మీ యజమానురాలిని; మీ రందఱును నా చెలులు. నేఁడు విషతాపోన్మత్తుఁడగు శంకరుని విచిత్రరీతుల నాటలాడి ప్రవలయు. కావున, నిప్పటికి మీ రంఱును మీ మీ పనులపై నరిగి సమయమునకు రండు.

చెలు—దేవిచిత్తానుసారము— (అనుబంధము ౩౯)

(మోహిని వినా అందఱు నిష్క్రమింతురు)

[శంకరుఁడు ఉన్మాదస్థితిలో ప్రవేశము]

శంక—(మోహినింజూచి యానందముతో) ఆహా! ఏమి నాభాగ్యము!

క. నాపాలిటి ధన మిదియే
నాపాలిటి యమరతరువనం బియ్యదియే
నాపాలి జీవ మిదియే
నాపాలిటి మన్మథాంగనామణి యిదియే.

ఈ సతికొఱకై కదా నారదునకు పెండ్లియనులంచమీయ సిద్ధపడి పార్వతిచేఁ బరిహాసపాత్రుండనైతిని. ఇప్పు డీసతి నెట్లైన వశపరచుకొనక మానను. ముందుగా నొకింత సంభాషించి చూచెదను. (ప్రకాశము) ఓ లోకైకసుందరీ!

గీ. తగిన యవయవసౌష్ఠవ_ర్తిఁ దగినరూపు
నిర్మితము జేసి బుద్ధి ననింద్యుఁ డగుచు
నిన్ను సృష్టించుకతన నో నీరజాక్షి
బ్రహ్మ చిరకాలమునకును బాసెనింద.

సృష్టికెల్ల సుందరవిగ్రహమునుఁ గల్పింపఁదలఁచి నిన్ను సృజించెనని నారదుఁడు వచించెను. ఇది నిజమా? నిజమైన నీ వెవ్వతెవు?

మోహి——నీ వెవ్వఁడవు! నీధోరణిం బరికింప నీవొక యున్మత్తుని వలె నున్నావే!

శంక——ఓనారీ! నీ దర్శనభాగ్యము నాకు గలుగకపూర్వ మేమో నేనెఱుఁగను గాని, నిన్నుఁ జూచిన దాదిగా నిజముగా నున్మత్తుఁడనే యైతినిసుమా!

మోహి——అట్లయిన నున్మాదపిశాచ మావహించిన నినుబోటివాఁడు నిజముగా దండనార్హుఁడే.

శంక——ఆ! నే నేమి దోషముచేసితిని?

మోహి——లెక్కింపఁ గల్గుట కొకటియా?

సీ. బాలాలలామల కేళీస్థలంబుల
కిచ్ఛమై విహరింప వచ్చు టొకటి
(పుష్పదండముచే నొకటి కొట్టును)

శంక——చాలు! బాలా!! ఇదియేటి సరసము!

మోహి——నిర్నిమి_త్తంబుగ నెలతలఁ బొడగాంచి
యతిలీల భాషించు టరయ రెండు
(పుష్పదండముచే రెండుకొట్టును)

శంక——ఇది మంచివినోదమయ్యె! ప్రహరణమే నీ కానంద మని పించెనా?

మోహి——పరసతీమణుల నబ్బురముగా బొడగాంచి
వర్ణింపఁబూనుట వసుధ మూఁడు
(పుష్పదండముచే ముమ్మారుకొట్టును)

శంక——(వలదని తర్జనిచే బెదరించును.)

మోహి—కమలగర్భుఁడు నీసువిమల సౌందర్యమి
ట్లయ్యారె! నిర్మించెననుట నాల్గు
(పుష్పదండముచే నాల్గుమారులు కొట్టును)

శంక—పడఁతీ! చాలింపుము నీ పరుషకార్యములను. ఊరుకొన్న కోలఁదియు పిల్లికి చెలగాటము నెలుకకు ప్రాణసంకటమయ్యెనే!—ఇదియేటి పరిహాసకృత్యము?

మోహి—గీ. కామహర? నీదు సర్వదుష్కార్యములకు
ప్రతిఫలంబుగ సద్బుద్ధి వచ్చునట్లు
పుష్పదండప్రయోగంబుఁ బూన్చి నీకు
గట్టిగాబుద్ధిఁ జెప్పెదఁగాచుకొమ్ము.
(పలుమారులుకొట్టి పారిపోవును.)

శంక—ధన్యోస్మి! ధన్యోస్మి!! మోహినీకరనిర్ముక్తపుష్పదండాహతి నాశరీరమున కెంతటిమహానందపారవశ్యముం గలిగించె! (దిశలు పరికించి) ఆహా! చనియెగా నామోహిని! ఎందుఁజనియె నా జగన్మోహిని? మోహినీ! నన్నువిడచి దూరము చనకు! నన్నువిడచి దూరముచనకు! (వెనువెంట పరువిడును.)

(అనుబంధము ౪౦)

మోహి—(ప్రవేశము) (అనుబంధము ౪౧)

శంక—(ప్రవేశము) (అనుబంధము ౪౨)

మోహి—ఓకామోన్మత్తుఁడా! దూరముగానుండి ప్రత్యుత్తరమిమ్ము.

శంక—ఓమదీయచిత్తాపహారిణీ! సెలవిమ్ము? చేతులొగ్గి యీదాసుఁడు నీ యీప్సితములఁ దీర్చువాఁడు.

మోహి—నీ కిదివఱకు సతీమణి లేదా?

శంక—కలదు. లేకేమి? కాని, కాళీస్వరూపిణియగు నాయాలిని విడచిన నేదోషమును సంభవింపదని నమ్మెదను.

మోహి—వెఱ్ఱివాఁడా! దార యెట్టిదైయున్న తద్విసర్జన మతిపాప కార్యముగాదా?

శంక—కాదు. ముమ్మాటికిని గాదు.

మోహి.—ఎందుచేత ?

శంక.—వినుము.

సీ. తనవిహారమునకు తగిన హార్యక్షము
దరియువారల కెల్ల వెఱపుఁగూర్ప
తనచేతి హేతి దుర్దానవాధమకోటి
ప్రాణవాయుగణంబు వాయఁజేయ
తనహస్తకలశంబు ఘనదైత్యకంఠర
క్తంబుల నాస్వాదనం బొనర్ప
తనదులీలాకేళి ధారుణీజనముల
పిరికిగుండెలు వికావికలు జేయ
భువనభీషణమై మహాద్భుతముగాగ
వీరరసపూరితంబయి వికృతమగుచు
గానుపించు నుమాభయంకరముఖంబు
ననుచితమటంచు నిఁక విసర్జనము సేతు.

మోహి.—తొలుదొల్త పార్వతి నీ హృదయసమ్మతయగుటచేతనే కదా పరిణయం బాడితివి ! కాలక్రమమున నిప్పుడామె యెట్లు నీ మానసమున కనంగీకృతయయ్యెనో కొలదిదినములకు నేను నయిత మట్లే నీమది కహితంబా పాదించిన నేదిగతి ! మఱి వారి కెదుటనున్నదే కదా పెండ్లికూతురు !

శంక.—ఆ ! ఆ ! ఎంతమాటాడితివి ? సౌందర్యమా నామది కహిత జనకంబగుట !

గీ. అహరహము నీదుసౌందర్య లహరియందు
మునిగి మధురామృతరసంబు, మోదమార
పాన మొనరించి, తద్గతిఁ బ్రదుకఁదలఁచు
చున్న నేనేమి ? నిను మానియుండుటేమి ?

మోహి.—అట్లయిన తొలుదొల్త పార్వతిం బరిత్యజించినఁగాని, నిన్ను చేపట్టనోపను.

శంక—ఇంకను పరిత్యజించుటన నర్థమేమి ? నావాక్యమున కన్యథాత్వ మేలసంభవించును ?

మోహి—ఇట్టి సమాధానవచనములు పురుషులకు సామాన్యములు. కావున, నీపలుకులను నేనెంతమాత్రమును విశ్వసింపను. (కొట్టి నిష్క్రమించును)

శంక— (అనుబంధము ౪౩) (నిష్క్రమించును)

నార— (అనుబంధము ౪౪) [ప్రవేశము]

పార్వ—నారదా ! నీకేమైన నీచిత్రచర్య బోధపడినదా ?

నార—అమ్మా ! బోధపడనేమోకాని, నేనంతవఱకు వేచియుండ నైతిని.

పార్వ—ఆసుందరి యెవ్వరై యుండును నెఱుఁగవు-గంగయగునా ?

నార—అబ్బే ! గంగను మన మెఱుగమటమ్మా ! గంగమొగమున కింత యందమెక్కడిది ?

పార్వ—స్వామివా రీకుటిలాలకవెంటఁబడుటకు హేతువేమైన నెఱుగుదువా ?

నార—అది తనవెంటఁబడుటచే నాతఁ డీమెవెంటబడెను.

పార్వ—అది తనవెంటఁబడు టేమిటి ?

నార—మరేమున్నది ! కామపిశాచము !

పార్వ—ఆపాదమస్తకమును మేలిముసుంగు కప్పుకొనుటచేత దాని రూపము పోల్పరాదయ్యె—నీవేమియు నెఱుగవా !

నార—ఎఱుగకేమి ?

పార్వ—అట్లయిన నదియెవ్వరో చెప్పవేమి ?

నార—చెప్పితినిగాదటమ్మా !

పార్వ—ఏమని ?

నార—నే నెఱుగనని.

పార్వ—ఓయనృతాలాపీ ! బడుగుబ్రహ్మచారీ ! క్షణములో నెఱుగుదునని పలికి—వెంటనే యెఱుఁగనన నేల ?

నార—స్వామివా రొకసుందరివెంట పరువెత్తుట నెఱుగుదును కాని

యీామె యెవ్వరో యెఱుగను.

పార్వ—నారదా! ఇప్పుడు మన మెచ్చిన నారంకులాడిని పట్టి బంధింపవలయును. మార్గాంతర మాలోచింపుము.

నార—అమ్మా! దీనికొక పెద్ద మార్గాంతర మేమున్నది? మన మిరువురమును చాటుననుండి సమయమును ప్రతీక్షించి పట్టుకొందము.

పార్వ—మంచిది. అట్లు చేయుదము.

(ఇరువురును చెఱియొకవంక దాగుదురు)

శంక—[ప్రవేశము.] అనుబంధము ర౧)

గీ. పలుకులందున నమృతంబు జిలువ నెవని
పలుకరించెను వాడె శ్రీవల్లభుండు
పడతి యెచ్చోటనిలచెనా పరమభూమి
సిరులుపండెడునట్టి సుశ్రీతలంబు.

మోహి—[ప్రవేశము] (అనుబంధము ర౬)

శంక—ఓదేవీ! పరమసౌభాగ్యనిధివైన నీయనుగ్రహమును కాంక్షించి గదా నీ వెనువెంటఁ దవిలితిని. నీకింకేల కరుణరాదు. నన్ను దయఁజూడవా! నీ విశుభ్రకటాక్షమాలికలఁ బ్రసరింపఁజేసి నన్నేల పాలింపవు.

మోహి—నాకోర్కె దీర్చెదవో లేదో తొలుత నిర్ణయింపవైతివి కదా! నన్నేల మాటిమాటికి విసిగించెదవు?

పార్వ—(తనలో) ఈ మాయలాడికోరిక యేమో తెలిసిన ననుకూలముగా నుండునుగదా!

శంక—ఓమోహినీ! నీకేల సంశయము?

గీ. అంబను మదర్ధదేహమునందుఁ జేర్చి
శాశ్వతముగ నర్ధాంశ మొసంగినాడ
నంతమాత్రముచేత నాయభిమతమున
కడ్డుపలుకఁగ పార్వతి కలవియగునె?.

పార్వ—(అప) చూచితివా! నారదా! నాకొసంగినయధికార ములపై నాకొకింతైన హక్కు లేదట! వింటివా నాథునిపలుకులు! ఎదుటబడి యిప్పు డడుగుదునా?

నార—అమ్మా! కొంచెము శాంతింపుము. సమయమువచ్చును.

శంక—మోహినీ! ఎంత ప్రార్థించినను వినవేని, నీపాదముల బట్టు కొనియైన వేడుకొందును. (పాదములపై బడును.)

మోహి—(నిష్క్రమించును.)

పార్వ—(మోహినిస్థానమున నిలచును.)

శంక—ఓదేవీ! దివ్యమంగళస్వరూపా! నిన్నెంతకాల మిట్లు వేడుకొందును. ఏకాంతమునకు నీస్థలమునసయితము నన్నలయించెదవా! నావంక చూడుము. నీకృపావృష్టిం బరపుము. (పార్వతింజూచి తెల్లపోవును.)

పార్వ—స్వామివారు సావకాశముగ భాషింపదగును. ఉన్మత్తతచే నెమఱచితిరి కాఁబోలును. నేను మీ మోహినీదేవింగాను. నన్ను పార్వతియని పిలతురు జ్ఞప్తియున్నదా!

శంక—నా మోహిని యేది?

పార్వ—మోహిని నన్వేషించుకొనుటకు కావలసినంత సావకాశము గలదు. నా ప్రశ్న కుత్తరమిందు.

శంక—(ఉద్రేకముతో) నీ ప్రశ్నల కుత్తరము లిచ్చుటకు నాకు సావకాశము లేదు. నీవిప్పు డేల వచ్చితివి! నా మోహిని యేది! నామోహినీ! నా మోహిని!

పార్వ—అంత తొందరపడ నేల?

శంక—ఛీ! ఇంకను ఆలస్యము చేయుచుంటివా? తొందరగాక సావకాశ మొకడిది! తొలగుము. నేనైన నా మోహిని నన్వేషించెద. (వేగముగ త్రోసి నిష్క్రమించును.)

నార—(ముందునకు వచ్చి) అయ్యయ్యో! స్వామివా రెంతమోటుతనముగా పడద్రోసి చనినారు. అమ్మా! నీవు ప్రకృతి సుకుమారివి. ఈ యున్మత్తుని హాళాహాళికి నీవు తాళనోపవు. నీ

వుండుము. ఈసారి నేను నిలచెదను.

(ఇద్దఱును చాటున నుందురు.)

[శంకరుడు—మోహిని ప్రవేశము]

శంక—ఓ మందగమనా! ఇంతదనుక న న్నేమరించి యరిగితివి గాని, యీసారిమాత్రము నీవు నన్ను తప్పించుకొనఁజాలవు.

(పాదములం బడును.)

మోహి— (నిష్క్రమించును.)

నార—(మోహిని స్థానమున నిలచును.)

శంక—దేవీ! నీ రూపవీక్షణమున ముగ్ధత్వము నందని ప్రపంచజను లెవ్వరు గలరు? నీ సాదరకటాక్షప్రసారమాత్రమునఁ దన్మయులు కానివా రెవ్వరు? కృపాంతరంగవై నన్నాదరింపుము. నీ కివే శతలక్ష నమస్కృతులు.

నార—(నవ్వుచు) స్వామివారికి స్త్రీపుంవిచక్షణ జ్ఞానశూన్యమగు చిదానంద స్థితి గల్గినట్లున్నది! స్వామీ! నేను తను దాసుడను. మీవంటివారు నా పాదములపైఁ బడఁగూడదు. లెండు. లెండు.

శంక—(చిరాకుపడి లేచి) ఓరి బ్రహ్మచారి మర్కటమా! నీ వేల వచ్చితివిరా! నా మోహిని యేది! నా మోహిని యేది?

నార—భూతలమునం గల సుందరాంగన లందరియందు పరమశ్రేష్ఠురాలగు నీమోహిని..........

శంక—ఔను. అదియే నా మోహిని. అట్లయిన నా మోహిని నీతో నేమనెను? తా నిందు వత్తుననెనా? నన్ను మెత్తుననెనా? నీతో మాటాడెనా? నా గతి యేమి చెప్పెను?

నార—తొందర పడకుఁడు. మోహినిని నేను చూడలేదు; భాషింపలేదు. కాని—

శంక—ఛీ! మునిముచ్చా! ఎంత కాలహరణము జేసితివి? నీవు చూడకున్న—భాషింపకున్న—నింక కానియేమి! ఛీ! తొలగిపొమ్ము. నా మోహినీదేవి నన్వేషించుకొందును.

(త్రోసి నిష్క్రమించును.)

పార్వ—నారదా! నీకేమైనది?

నార—ఏమగుట కేమున్నదమ్మా! నీకైనదే నాకైనది.

పార్వ—అట్లైన నింకేది మార్గము?

నార—ఈ యాడుది యెవరో మనమిద్దరముం గలసి పట్టుకొందము. ఇదే దారి.

(ఇరువురును చాటున నుందురు.)

శంక— (అనుబంధము ౪౭.)

నేను మోహినీమంత్రము జపముచేసి యాకల్యాణిని స్వాధీనపరచుకొందును. ఏల ప్రసన్నురాలు కాదో చూచెదను. (జపించును.) మోహినీ! మోహినీ! మోహినీ! మోహినీ!

[మోహిని చెలులందరును మోహిని యాకృతులతో చుట్టును నిలతురు.]

శంక—(చుట్టును బరికించి) ఆ హా హా! ఏమి నాభాగ్యము!! నా మోహిని విశ్వాకారధారిణియై నన్నుఁ బాలింప నిందు సాక్షాత్కరించినది. పోయి ప్రసన్నురాలిం జేసికొందుగాక! (ఒక మోహినిదగ్గర కేగి)

గీ. నన్నుఁ బాలింప గతియంచు నమ్మి నిన్ను
ప్రార్థనము చేసెదను దయాభరముమీఱ
నన్ను గావుము నీ చరణముల నింక
గన్నదోయిని జేర్చెదగాక సుదతి.

1 మోహి—(చెంపపైగొట్టి నిష్క్రమించును.)

శంక—ఓహో! ఇదేమివిలాసము! (ఇంకొక మోహినిం జూచి)

గీ. లలనరో! నీకిది యొక విలాసమటవె?
నన్ను బ్రహరించు టేటిఘనంబు నీకు
చిలుకపలుకుల నాదగు చింతఁదీర్చి
తాపభరమును దీర్పవే తరుణి వేగ.

2 మోహి—(చెంపపైఁ గొట్టి నిష్క్రమించును.)

శంక—అబ్బా! ఊరకొన్నకొలదియు నీ మోహినీదేవి యార్భాటము మితిమీరుచున్నదే! (వేరొక మోహినింజూచి) ఓ దేవీ! జగన్మోహినీ!

గీ. నాకపోలంబు వాచె నో నాతిమిన్న
ప్రార్థనముచేతు నిను దయాభరముమీర
సాదరంబుగ నను వేగ నాదరించి,
గురుదయాహ్లాదయంబున నరయరాదె!

3 మోహి—(చెంపపైఁ గొట్టి నిష్క్రమించును.)

శంక—ఏమి యిది! అందఱు నొకటే పాఠ మప్పగించుచున్నారే! ఈ మోహినీవదన మొకింత దయారస భరితమై యున్నట్లు తోఁచుచున్నది. ఈమె యేమైన దయజూచునేమో! ఓ మోహినీ!

గీ. పదుపు రొకటయి బాధింప భావ్యమగునె
నీవయిన నన్ను దయజూడవే వరాంగి!
పాదపద్మము లంటెద నాదరించి
నన్ను రక్షింపవేల బంగారుబొమ్మ.

4 మోహి—(చెంపపైఁగొట్టి నిష్క్రమించును.)

శంక—ఈ మోహినీదేవత లందఱును దయారహిత మానసలుగా నున్నారే! ఈ మోహిని యేమైన దయజూచునేమో? ఓ మోహినీ! నీకైన దయరాదా!

గీ. ప్రేమ మందహాసముఁ బ్రసారింపఁజేసి
నా మదిని శాంతపరుపవే కోమలాంగి!
కోమలానూన సౌందర్య సీమవైన
నాతి వీవునుఁ గఠినమానసవె చెపుమ.

5 మోహి—(చెంపపైఁ గొట్టి నిష్క్రమించును.)

శంక—(నిరాశతో) కటకటా! అందఱుమోహినులును బ్రహరించిరి. ఇఁక నీ మోహినికడ గూడ బహుమతు లందియే నిరాశ చేసికొందును. ఓ మోహినీ! ప్రహరింపుము. నీవును బ్రహరిం

పుము. నిన్నుమాత్ర మేల కాదందును.

గీ. ఎందరో నగ్గపోలమునందు మోది
బాధసలుప సహించితి పద్మగంధి!
యింక నొక ప్రహారంబు సహింపలేనె
ప్రాంచితకపోల మింక బాధించిపొమ్మ

6 మోహి——(చెంపపైఁ గొట్టి నిష్క్రమించును.)

(నిజమోహిని కనఁబడును.)

శంక——(చూచి ఆశతో) ఆహాహా! వీరందఱును మాయామోహినులు. ఇదిగో నా నిజమోహినీ! నా కీమె తప్పక ప్రసన్నయగును. (అనుబంధము చూ.)

(వెంట పరుగెత్తును.)

పార్వ——నారదా! శంకరునంతటివాని కిట్లు కపోల ప్రహారములు గల్గుట నాకు మిగుల విచారకరముగ నున్నది సుమా!

నార——అమ్మా! ఇందుల కేల విచారము!

ఆ. కాము గెలువవచ్చు కాలారిగావచ్చు
మృత్యుభయము వీడి మెలగవచ్చు
ఆడువారి చూపుటంపర గెలువంగ
తరముగాదు త్రిపురహరునకైన.

ఇఁక మన మాలసింపక యీ మోహినింబట్టి బంధింతము రమ్మ.

(4, 5, సార్లు మోహినీ శంకరులు తిరిగిన తరువాత నారదుడు పార్వతి మోహినిం బట్టుకొందురు. మోహిని విష్ణువుగా మారును. అందరును తెల్లపోవుదురు.)



శ్రీరస్తు

# పార్వతీగర్వభంగము
అను

# గంగావతరణము

## సప్తమాంకము

### 1 వ రంగము

[సాగరుఁ డను నొక కుష్ఠురోగి ప్రవేశము]

సాగ— (అనుబంధము ౪౯.)

హా! పరమేశ్వరా! దీనదయాపరా! పరాత్పరా! నే నెన్ని జన్మములయందు సంపాదించిన పాపఫలంబుననో కదా న న్నిట్లు కుష్ఠురోగినిగా జన్మింప జేసితివి!

సీ. గోట మీటినయంత ఘోరంబుగా రేగి
భీభత్స బాధ గల్పించువ్యాధి
మొత్తంబుగా చీము నెత్తురు లేకమై
మించినగోత బుట్టించువ్యాధి
దూరవాసులకైన దుర్గంధమునుదోప
జేయుచు శిరము వంచించువ్యాధి
యన్న పానీయంబు లంటనీయక నహో
రాత్రము లేడ్పించునట్టి వ్యాధి
పొగలు మంటలతోఁ దాపమును ఘటించి
ఘోర నరక బాధలు గలిగించువ్యాధి
కటకటా! శత్రువులకైన గలుగవలదు
దుష్టకార్యఫలంబగు కుష్ఠువ్యాధి.

ఔషధంబులచే నాయాసమంది విఫలమనోరథుండనైతిని. యాత్రా సేవనములుచేసి హతాశుండనైతిని. ఇంకేమి జేయుదును.

తల్లీ! మృత్యుదేవతా! నీకయిన నాపై దయగలుగదాయె గదా! పాపీ చిరాయు వనుమాట సార్థకరపరచితివిగదా!

నార—(ప్రవేశము) (అనుబంధము ౧౦)

సాగ—మహాపురుష! మీరెవ్వరో దయామయులని తోచుచున్నది. పుణ్యాత్ము లగు మీ రీ కుష్ఠురోగి చెంత కేల వచ్చెదరు? స్వామీ! తొలగిపొండు! మీకిచ్చటినుండియే నమస్కారము.

నార—వెఱ్ఱివాఁడా! నేను నిను గాంచి రోతనంది తొలగిపోవుటకు వచ్చినవాఁడనుగాను. నీదుస్థితిం గని జాలినంది, నీకు తరణోపాయము నెఱింగింప వచ్చితిని.

సాగ—మహాత్మా! మీ రెవ్వరు?

నార—సాగరా! నేను త్రిలోకసంచారి నగు నారదుఁడను. నీవు కైలాసంబున కరిగితివేని నీ కచ్చట పరమేశ్వర పంకజాక్షి సహితంబుగ, గంగాదర్శనం బగును. గంగామాహాత్మ్యమున నీకు మోక్షము గలుగును. నీకు కైలాసమార్గము నెఱిఁగించెదను రమ్ము.

(అనుబంధము ౧౧)

సాగ—భాగ్యము.

---

## 2-వ రంగము

### కైలాసము

[శంకరుఁడు పరుండియుండును చెరియొక ప్రక్క నారదుఁడు పార్వతియును.]

(అనుబంధము ౧౨)

శంక—నారదా! పార్వతితత్వము క్రమక్రమముగ వెఱ్ఱిలోఁ బడిపోవుచున్నది సుమా!

నార—స్వామీ! ఎందుచేత?

శంక—ఎందుచేతనని యడుగనేల? వెఱ్ఱి లేని నన్ను నిష్కారణముగ వెఱ్ఱివాఁ డనుచున్నది. ఇంతకన్న వెఱ్ఱితన మేమున్నది?

నారద—మహాప్రభూ! చిత్తము. పార్వతీదేవి బేలమనస్సుగల దగుటచే నట్లనుకొనుచున్నది. అంతేకాని తమ కేమి? వెఱ్ఱియేమి?

శంక—ఔనుగాని వెఱ్ఱివాఁ డెట్లుండునో యనలేపార్వతి యేమైన నెఱుఁగునా?

నారద—నిజము స్వామీ! ఒక్కసారి వెఱ్ఱివానిలక్షణము లేమో తెమరు చెప్పితిరా? యింకొకసారి పార్వతీదేవి మిమ్ము వెఱ్ఱివాఁ డని పలుకదు.

శంక—అట్లయిన చెప్పుమందునా?

నారద—అభ్యంతర మేమి?

పార్వ—నారదా! ఇదియంతయును వెఱ్ఱిగాదఁట! తుదకు నేనే వెఱ్ఱిదాననైతినఁట! నాప్రారబ్ధ మిట్లు పరిణమించినదా! అయ్యయ్యో! నే నేమిచేయుదును?

శంక—అబ్బబ్బబ్బా! వలదని చెప్పుచున్నకొలదియు నీ వా వెఱ్ఱియను మాట మానవుగదా! వెఱ్ఱి వెఱ్ఱి యని నన్ను మరింత వెఱ్ఱివానిని చేయుచున్నావు. తుదకు నే నేగంగలోనో దిగవలసిన యోగము వచ్చినది.

నారద—(స్వగతము.) ఆఁ-అదిమాత్రము శీఘ్రకాలముననే కలుగనైయున్నది.

పార్వ—(అప) వింటివా వింటివా నారదా! తుదకు నాథునకుగూడ గంగపైఁ బ్రేమయేకదా!

నారద—(అప) అమ్మా! ఊరక లేనిపోని యనుమానములు పెట్టుకొని మనస్సును పాడుచేసికొనుచున్నావు. ఆయనమాటవరుస కట్లాడెను.

శంక—అదిగో! నేను వినుచున్నాను. నాయొడలు మండుచున్నది. మీ రిద్దఱును నాపై నేదియో గుసగుస లాడుకొనుచున్నారు.

నారద—కాదు మహాప్రభూ! కాను. మీరు వెఱ్ఱి లేదని గట్టిగ పార్వతీదేవితో బోధచేయుచున్నాను.

శంక—సెబాసు! నారదా! అట్లయిన నీవు చాల మంచివాఁడవు.

అట్లు చెప్పుచుండుము. నేను నిన్ను వద్దనను.

నార — తమరు వెఱ్ఱివాని లక్షణములు చెప్పెదనంటిరే!

శంక — ఔనుసుమా! మరచితిని. వెఱ్ఱివాడు మెడలో నెముకలు కట్టుకొనును.

నార — (తనలో) మీరు సర్పము ధరించుచున్నారో (ప్రకాశము) చిత్తము. తరువాత ?

శంక — వెఱ్ఱివాడు శరీరమునిండ బూడిద పూసికొనును.

నార — (తనలో) మీకును భస్మచందనమే కదా! (ప్రకాశము) చిత్తము. తరువాత ?

శంక — వెఱ్ఱివాఁ డెద్దునెక్కి యూరేగును.

నార — (తనలో) తమరు నేమియెక్కి యూరేగుచున్నారు ? (ప్రకాశము) చిత్తము తరువాత ?

శంక — వెఱ్ఱివా డిల్లువిడిచి వల్లకాటిలో దిరుగును.

నార — (తనలో) తమకును స్మశానమే కదా కాపురము! (ప్రకాశము) చిత్తము. తరువాత ?

శంక — చిత్తము సరేకాని, నేను వెఱ్ఱివానిని వర్ణించుచుండగా నీవు మాటిమాటికిని లోలోన నేదియో గొణుగుకొనుచున్నావేమి ?

నార — అబ్బా! వెఱ్ఱివాడింత విస్పష్టముగా నుండునా? యని నాలో నేనాశ్చర్యపడుచున్నాను.

శంక — అంతేకద. నేను వెఱ్ఱివాఁడనని నీతలంపు కాదుగద!

నార — నారాయణ! మీరు చెప్పినలక్షణములలో మీ కేవిగలవని మిమ్ము వెఱ్ఱివాఁ డందును.

శంక — అబ్బా! ఆమాట నాచెవినిబడగూడ దనుచుండగా మరల మరల వెఱ్ఱియనుచుంటివే? నారదా! నీవును దొంగలజట్టులోని వాడవే. కాదుకాదు. నీవే పెద్దదొంగవు. నీవు నాలిముచ్చువు. కొంకినక్కవు, నిన్ను నమ్మగూడదు. పార్వతి నంతకన్న ముందే నమ్మగూడదు. భృంగిగానిని ముందే నమ్మ

గూడదు. ఎటుచూచినను మీరు నన్నీయింట బ్రదుకనిచ్చున ట్లగపడలేదు. నేను గుమ్మమున కొకకబళముగా బిచ్చమెత్తు కొని పోవు దారి చూచుచున్నారు. నే నీయింట నొకక్షణము నిలువను. నేను మీయాభీష్టమే నెఱవేర్తునులెండి. ఓరీ భృంగీ! భృంగీ! నా నందివాహన మేదిరా? నా నందివాహన మేదిరా? నే నిదే సన్యాసినై పోవుచున్నాను. వీఁడు సయితం మిప్పుడు మాటాడుటలేదు. వాని కేమిదుర్బోధనలు చేసి నారో. కంఠమున కడ్డముగ గరళపుముద్ద—నారదా నాశరీ రము మండుకొని పోవుచున్నది. నాకు తాప మధికమగు చున్నది. లోకమునందలి పాములు, త్రేళ్ళు, జెఱ్ఱులు, అన్నియు నా శరీరమును గఱచి కండలు పీకివేయుచున్నవి. నా ప్రాణ ములు పోవ సిద్ధముగ నున్నవి. అబ్బా! గుండెలలో గునపపు పోటు, శిరమున కత్తివ్రేటు, తల తిరిగిపోవుచున్నది. తిరిగి పోవుచున్నది.

(మూర్ఛిల్లును)

పార్వ—(పట్టుకొని) నాదా! నాథా! ఏమియిది! నారదా! నేనిప్పు డేమిచేయుదును? నా మనోరథము భగ్నముగా నున్నది. నా మాంగల్యమున కశుభపరిణామము గలుగనున్నది కాబోలును.

(అనుబంధము ౫౩)

నార—అమ్మా! ఇప్పుడిట్లు వగచిన నేమిలాభము? ఈవిషతాపము చల్లారుట కొకట్టే మార్గము గలదని విన్నవించియుంటిమే. తమరు దానిని పాటింపక వ్యవహారము నింతవఱకు తెచ్చితిరి. ఇది మీ స్వయంకృతాపరాధముగాని వేరుగాదు.

పార్వ—ఏమి? ఏ దా మార్గము?

నార—గంగను మహేశ్వరుని శిరముపై—

పార్వ—నారదా! ఎంత కుటిలహృదయుడవు? ఆ దురాత్మురాలిని నా నాధుని నెత్తిపైఁ బెట్టుమని చెప్పువాక్యపిశాచ మింకను నిన్ను వదలదయ్యెనుగా! నాపై మాత్సర్యముంబూని నన్ను

దూషణములాడి నా పతిశిరముపై నెక్కి నాకు సవతియై నన్ను వంచింతునని పలికిన దుర్మతియగు గంగపై మీ యందఱకీ యభిమాన మేమి? నన్ను పరాభవముపాలు చేయుటకదా మీతలంపు. ఎందరేమన్న నందురుగాక! సూర్యచంద్రులు పశ్చిమదిశాప్రాంతమున నుదయమందుదురుగాక! తారకా సమూహములు నేలరాలుఁగాక! మరేమైన నగుఁగాక! కుటిలమతి యగు గంగను నా నాథుని తలపై కెక్కనిత్తునా! మీమీమోసములం జిక్కి యవమానమునందుట కంత తెలివి మాలినదాన ననుకొంటివా! నీకలహగుణమును గట్టిపెట్టి కొమ్ము. పార్వతియన్న నేమనుకొంటివో? బ్రహ్మచారీ! కలహాశయా!

(అనుబంధము ౨౮)

నార—తల్లీ! ఇది మంచివినోదమయ్యెను. ఉపకారమునకుబోవ నప కార మెదురైనదట! నీ భర్తతాప మణగి మీకుశుభమగు మార్గము నాకు తోచినంత వచింపబోవగా నన్నే దూషింప దొరకొంటివేమి?

పార్వ—ఔను. నిజమే చెప్పితివి. ఇందు నీదోషములేదు. ఇది నా పతికి నిజమగు వెఱ్ఱికాదు. గంగను గాంచి కామపీడితుడై యీ భ్రష్టురాలిని నెత్తిపై నెక్కించుకొనదలచి పన్నిన కపటము. నే నీకపటములకు లోబడుదానను గాను. దేవేంద్రుఁ డశ్వినీ దేవతలను పంపెదనని చెప్పినాఁడు. వారు వచ్చిన తోడనే యీ వెఱ్ఱివేషమంతయు బహిరంగము కాగలదు.

శంక—(లేచి) "గుడగుడశబ్దం కుండకునష్టం" వింటిని; అంతయును వింటిని. ఆ యశ్వినీదేవతలకొఱ కెందులకు కబురంపితివి చెప్పుము. నేను వెఱ్ఱివాడ ననియేనా? నేను పట్టియున్నత్తుఁడ నైపోయితి ననియేనా? (నారదుని పార్వతిని పట్టుకొని) చెప్పుడు? చెప్పకున్న నేను సహింపను.

(అనుబంధము ౨౯)

నార—శంకరా ! నన్ను వదలుము. నేనంతయు జెప్పెదను.
శంక—వదలను. తొలుత చెప్పుము.
నార—ఇది శ్రీ మహావిష్ణువు నాజ్ఞ. ఆయన యట్లు చెప్పుటచేతనే కబురంపితిమి.
శంక—(వదలి నిరాశతో) శ్రీమహావిష్ణువుగూడ నన్ను వెఱ్ఱివాడని యే భావించుచున్నాడా ! ఇదియంతయును నాపురాకృతకర్మ ఫలము. నారాయణున కేమి ? నారయణుఁ డెన్ని శ్రీరంగ నీతులైన పలుకఁగలఁడు. తనదాక వచ్చినప్పుడుగదా తనకు తెలియుట ! నారదా ! పార్వతి యశ్వినీదేవతలకొఱకు కబురంపినదా? కానీ! కానీ! ఈశక్తికి సగము దేహమిచ్చినందులకు నన్నిట్లు పరిపాలించుచున్నది. పాలింపనిమ్ము. అశ్వినీదేవతలు వచ్చిరా శూలముతోఁబొడిచి చంపెదను. ఏదీనాశూలము ?
పార్వ—ఇప్పు డాశూల మెందులకు ?
శంక—హుం ఏందులకా ? అశ్వినీదేవతలను చంపుటకు !
పార్వ—అశ్వినీదేవతలను చంపి యాయపచారము నానెత్తిపై గట్ట నేల ? నన్నే చంపరాదా ?
శంక—నారదా ! వింటివా ! దీనిమాటలు ! సరే ! కానిమ్ము. శూల మక్కఱలేదు. అశ్వినీదేవతలను పిడికిటిపోట్లతో పొడిచి చంపెదను. (పరుంగును.)
నార—దేవా ! శాంతి నందుఁడు.
శంక—అశ్వినీదేవతలు వచ్చువఱకు శాంతియే!ఆపై ముష్టియుద్ధము.

[తరువాత గంగ పురుషాకృతితో ప్రవేశించును.]

గంగ—దేవేంద్రుని యానతి ననుసరించి యీపురుషాకృతిని ధరించి తిని. దీని నెట్లు సమర్థించుకొందునోకదా !

గీ. ప్రకట గంగావతరణ నాటకమునందు
నాయికకు నాకు పౌరుష నటన మిచ్చె
ఘనుఁడయిన జగన్నాటకగ్రంథకర్త !
యెటుల నా పాత్రమును నిర్వహింపగలనొ ?

ఈ ప్రదేశముం జేరకపూర్వ మించుక ధైర్యమును వహించియే యుంటిని గాని శంకరుని జూచునప్పటికి నా ధైర్యము జారిపోవుటయే కాక పాదములు కంపించుచున్నవి. (నడచుచున్నది.)

నార—మహాప్రభూ! ఇప్పుడు మీయాగ్రహామునకు హేతువే లేదు.

శంక—నారదా! ఎందుచేత?

నార—ఇప్పుడిచ్చటికి అశ్వినిదేవతలకు మారుగా వేరొక పురుషుడు వచ్చియున్నాడు

శంక—ఎవ రాతడు?

గంగ—(నమస్కరించి) మహేశ్వరునకు నమస్కారము.

శంక—నారదా! ఇతఁ డేకారణముననో నాకు ప్రియదర్శనుఁడయి యున్నాఁడు సుమా!

నార—అవకతవకనటకుని యలంకారమువలె నీతని వేష మంతసహజముగ నున్నట్లు నాకు గనఁబడుట లేదేమి? స్వామి!

పార్వ—నారదా! నూతనులయెడలనా నీబ్రహ్మచారిమర్కట హాస్యములు! అయ్యా! రండు. ఇందు దయచేయుడు. తమ రెవ్వరు? ఎచ్చటనుండి వచ్చితిరి?

గంగ—అమ్మా! అశ్వినిదేవతలు దేవకార్యముల కరుగుటచే వారి శిష్యుఁడ నగు నన్ను మహేంద్రుఁడిందు బంపెను.

శంక—నారదా! అశ్వినిదేవతలశిష్యుఁడనుటచే నా కాగ్రహాము నే యున్నది గాని, ఈతనిముఖ మేమో నన్నాకర్షించుచున్నది.

నార—స్వామీ! మీ రీతనికి లోబడితిరేని ప్రమాదము సంభవింపఁగలదు. వయస్సుమీరిన వేశ్యను, వయస్సుమీరని వైద్యుని నెన్నడును నమ్మగూడదు.

పార్వ—సరసరి. బాగుగ నున్నది. నారదా! వైద్యశిఖామణి యగు నాతనితో నీ కేమిపరిహాసము? అయ్యా! తమ పేరేమి?

గంగ—నాపేరు గంగ.

పార్వ—ఏమిది? మీపేరు గంగయా?

నార—అమ్మా! ఇతఁడు శిఖండివంటి జన్మముగలవాఁ డేమో.

గంగ—(స్వగ) అయ్యయ్యో! పొరపాటున నెంతప్రమాదము చేసితిని! ఎట్లయినను నోరుజారినమాటను సమర్థించుకొనవలెను. (ప్రకాశము) అమ్మా! చెప్పుచుండగా నడ్డమువచ్చితిరి. నా పేరుగంగకాదు. గంగాధరుఁడు.

నార—ఎచ్చటనైన నీళ్లబిందెలు మోసితివా యేమి? అందుచేత నీకీబిరుదు లభించెనా?

పార్వ—నారదా! అధికప్రసంగములను మానవుగదా?

నార—అమ్మా! మీ రేమన్నను సరే; కాని, నే నీదొంగవైద్యుని నమ్మను.

పార్వ—అయ్యా! ఆతనితో నేమి? ఆతఁడు పరిహాసప్రియుఁడు—కలహాభోక్త. మీకు సర్వవిషయముల నెఱిఁగించియే దేవనాథుఁడు పంపియుండును. నానాథు నెట్లు స్వస్థచిత్తునిచేయుదురో! మీదే భారము.

గంగ—అమ్మా! శక్తిని ప్రదర్శించి స్వామియాజ్ఞ నెఱవేర్చుకొందును.

నార—అట్లయిన నీశక్తి యేమాత్రమో కొంచెము పరిశీలింపవలసినదే. నీపగటివేషము, వేడిమూతి చూడగా నాకనుమానము గల్గుచున్నది. నీవైద్యశాస్త్రజ్ఞానముం బరిశీలింతును. నాప్రశ్నలకు త్తరమిమ్ము?

గంగ—(తనలో) ఈనారదుఁడు గుట్టు బట్టబయలు చేయునా యేమి? (ప్రకాశము) అట్లే చెప్పెదను.

నార—ప్రపంచమున రోగము లెన్నివిధములు?

గంగ—అయ్యా! ఇదేమిప్రశ్న.

గీ. బహుళమైన చరాచరప్రకృతియందు
నామయములు కోటానుకో ట్లగునుగాదె
శారదాంబరమందలి తారకలను
వ్యాధులను గణింపగ నేర్చువారు గలరె?

నార—సరిసరి, నీవైద్యశాస్త్రజ్ఞానము చక్కగా నున్నది లే! ఇఁక

నీవు వైద్యము చేయనక్కఱయే లేదు. పొమ్ము. పొమ్ము తుద కేరి యేరి దేవేంద్రుఁడెంతజ్ఞానముగల వైద్యుని బంపినాఁడు

గంగ—ఏమి? రోగము లనంతములుగావా?

నార—తప్పుతప్పు రోగములు రెండే విధములు.

గంగ—అవియేవి?

నార—మనోవ్యాధి. దేహవ్యాధి.

పార్వ—తమ్ముఁడూ! దేవభిషక్కుణి!

గంగ—(తనలో) తమ్ముఁడూ యనక చెల్లెలాయనిన తగియుండును గదా!

పార్వ—తమ్ముఁడూ! దేవభిషక్కుణి! (అపవారించి)

గీ. ఇతఁడు విషపానవశమున నిట్టిగతిని
బొందెనో? గంగపై భ్రాంతి నందినాఁడో?
విమలభేషజముహింపూవి వేకముననుఁ
దెలియఁజేయుము నీకు సత్ఫలముగలుగు.

గంగ—(తనలో) ఇప్పుడు దేవేంద్రుని యానతిప్రకారము నటించెదను. (ప్రకాశము) అక్కా! అట్లే చేసెదను. ఇప్పుడు నే నితనిపై శాంబరీ మంత్రముం బ్రయోగింపదలచి యుండుటచేత—

ఆ. ధీమతంబు శాంబరీమంత్ర మిదిగాన
స్త్రీలువృద్ధజనులు శిశువులెనుట
నుండిరేని ఫలము నొసగదు సరిగదా
జీవహరణమొనరఁజేయునమ్మ!

అందుచేత పదినిముసములకాలము మీరావల నుండవలయును. ఇది మాగురువుల యానతి.

పార్వ—తమ్ముఁడూ! అందుల కింతయేల? నే నిప్పుడే యావలి మందిరమున కరిగెదను. ప్రాణేశ్వరు నెట్లు నిరామయుని జేసెదవో నీదే భారము.

గంగ—అక్కా! నీవెట్టిమహానీయునిఁ జూచితివో నేను నట్లే చూచెదను.

పార్వ—నారదా! నీవు దగ్గఱనుండి వైద్యము చేయింపుము.

నార—అమ్మా! నాకీవైద్యునిపై విశ్వాసము లేదని తొలుతనే వచిం
చితినిగాదా!

పార్వ—నీపరిహాసముల కేమిలే! తమ్ముఁడూ! జాగ్రత్త-
(నిష్క్రమించును.)

గంగ—(స్వగతము) నేనిప్పు డేమిచేయుదును! అకటా! నాశరీర
మప్పుడే స్వేదసిక్తమై యాపాదమస్తకమును కంపించుచున్నది

సీ. పలుకుదునా నేను వైద్యుండఁగాను నీ
పాదదాసినటంచు భవునితోడ
తెలుపుదునా విష్ణుదేవునానతులు సా
కల్యంబుగా కాలకంధరునకు
చేరుదునా హరుశీర్షంబు నిప్పుడే
విషతాప మంతయు వీడిపోవ
పంతంబునను ధిక్కరింతునా శివురాణి
నంబుజాక్షుని సహాయంబుచేత
నేమిసేయుదు నిపుడు నా కేది వెరవు
తనువు కంపించె గుండెలు తల్లడిల్లె
ఫాలభాగంబు స్వేదసంభరిత మయ్యె
కాలకంఠసమీపభాగ్యంబు చేత.

శంక—వైద్యశిఖామణీ! ఇటురమ్ము. నీవు నయితము నన్ను వెఱ్ఱివాని
గాభావించి వచ్చినట్లున్నది. కాని, నాడీపరీక్ష చేత నే నున్మా
దుఁడను గానని నీవైనను గ్రహింపకపోవు. ఇటురమ్ము. నా
చేయిపట్టుకొని చూడుము. నాడీనిదానముం బరీక్షింపుము.

గంగ—(చేయిపట్టుకొని నాడిని పరీక్షించును.)

శంక—(మూర్ఛిల్లుచున్నాఁడు.)

గంగ—నారదమునీంద్రా!—ఏమియిది! నేనీతని కరస్పర్శము చేయు
టయే తడవుగా మూర్ఛిల్లెను.

నార—బాలవైద్యము ప్రాణాపాయకరమని నేను తొలుతనే చెప్పి

తిని. కల్వము చేతఁబట్టుకొని కలబందమట్టలు నూఁరుకొనవల
సిన నీవిచ్చటికేలవచ్చితివి ? (శంకరునితాఁకిచూచి) అబ్బా !
ఎంత వేడిగానుండినశరీర మెంతలో చల్లనయిపోయినది !
వైద్యముచేయవయ్యా వైద్యశిఖామణీ.

గంగ—(స్వగతము) గంగ నగు నాసంస్పర్శమున, నీతని విషతాపము చల్లనై యీ విధమున శీతలమైనదని తోఁచుచున్నది.

నారద—అయ్యయ్యో ! ఏమీ నీ కీమాంద్యము ! ప్రాణములమీఁదికి వచ్చియుండగా కోడిని మ్రింగినపిల్లివలె యులుకక, పలుకక నూరకుండెద వేమి ?

గంగ—మునీంద్రా ! భీతి నందకుఁడు ! మహేశ్వరుని చేతితోఁదట్టి లేపుఁడు ? అపాయము తొలగినది !

నారద—స్వామీ !—స్వామీ !! (లేపును.)

శంక—(లేచి) ఆహా ! నాకెంతపెద్దనిద్దుర పట్టెను. నారదా ! శర త్కాలచంద్ర మండలమునకన్న చల్లనై హిమానీతుషార సముదయసంస్పర్శనమునకన్న సంతాపనివారకసంశీతలపద్రమై మృదులకుసుమకిసలయసమూహ శయ్యాతలమునకన్న మంజు లతాప్రపూర్ణమై, పరబ్రహ్మసాన్నిధ్యముకన్న బ్రహ్మానందదాయ కమైన యీ బాలవైద్యుని కోమలకరపల్లవమేది ? యేది ? ఆహాహా ! సన్నిహస్తపద్మమేకదా ప్రజ్వలిత మహానలకీలా సందోహమువలె శరీరము నుడికించునీతాపముం బ్రశాంతపరచి నది ! ఏది యీకరకమలము !

గీ. వేయిశశిబింబములు మింట వెలిగినట్లు
కోటివిద్యుల్లతలకాంతి గూడినట్లు
వింతయగు తేజ మాత్మ నావిర్భవించె
ప్రాణపంచకమును పారవశ్యమందె.

నారద—స్వామీ ! ఈవైద్యునిచేయి తగులునప్పటికన్న నిప్పుడు మీరు విశేషవిజ్ఞానముతో మాటలాడుచున్నారు. మీ కీతనిమందు బాగుగా పనిచేసినది.

శంక—నారదా ! ఈవైద్యుఁడు నాసమీపమునుండి చనునంతదనుక, నాకేమంగులు సక్కఁలేదు సుమా ! సరిగాని, నాకొక సందేహము గలుగుచున్నది. చూడు ; ఈ వైద్యునిరూపమునకు, సౌకుమార్యమునకు స్త్రీరూపము తగినది గాని, యీ దిక్కుమాలినపురుషాకృతి చూడ నాకేమియు తగియున్నట్లు లేదు. ఇందులకు నీ వేమందువు ?

నార—స్వామీ ! మీ రీమెలోగుట్టును బాగుగ గ్రహించి మాటాడితిరి.

శంక—ఆ ! ఆ! ఈమె యనుచున్నా వేమి ?

నార—అయ్యా ! ఇంకెంత నిదానింపగలను ! కొంతసేపు గోప్యముగనే యుంచి యీచిత్రనాటకము నీక్షింతమనియే యుత్సాహపడితిని గాని, యిచ్చినపదినిముసములగడువు నింక పూర్తి గావచ్చుచున్నందున, పార్వతీదేవి బ్రహ్మరాక్షసివలె వచ్చి పడును. కార్యభంగము: చేయును. కావున గంగా ! నీవింక జాగుచేయక నీ నిజాకృతిం బ్రదర్శింపుము !

శంక—ఏమి నారదా ! ఈ వైద్యవేషధారియా గంగ ?

గంగ—(స్వగతము) నారదుఁడు మర్మభేదనము చేసినాడు ! ఇంక నాకీవేషమేల ? (వేషమునుదీసి ప్రదక్షిణనమస్కారములు చేయుచున్నది)

(తెరలో)

నారదా! శాంబరీమంత్రము పూర్తియైనదా ? నే నింక రావచ్చునా ?

నార—(తత్తరముతో) అయ్యయ్యో ! అనుకొన్నంతయైనది ! పార్వతీదేవి రానే వచ్చుచున్నది ! శంకరా ! శంకరా! గంగ నావలకు పంపవయ్యా !—వెఱ్ఱివానివలె మరల వేష మభినయింపవయ్యా !

శంక—నారదా ! పార్వతి వచ్చుగాక ! బ్రహ్మదేవుఁడు వచ్చుగాక ! నే నీసౌందర్యమూర్తిని విడువగలనా ? విడిచి యీ ప్రాణములు భరింపఁగలనా ?

ఉ. నీశిరమందు గంగ నిఁక నిల్పుకొనందగునంచు ప్రేమతో
శ్రీశుఁడు బల్కె నెల్లిదము జేసె నటంచు దలంచినాఁడ నీ
భాసురగాత్రి సోయగ మపారమంటంచు గ్రహింపనైతి నే
డేశిరమందు దాల్చెద; నుతించెద బూవులపూజ జేసెదన్.

నార — అయ్యయ్యో! అయ్యవారిని చేయబోవ గోఁతియైనది. ఈఁత డీగంగను గాంచి పెద్ద భ్రమలోఁ బడిపోవు నాఁడు మరల్ప తరము గాకున్నది. పార్వతి వచ్చెనేని ప్రళయము సంభవించును.

శంక — నారదా! నీవు నా మహానందప్రవాహమును నిరోధింపకుము. గంగా! సౌందర్య తరంగ!!

సీ. వీక్షింపవే! నీకటాక్షాంచలంబుల
ప్రసరింపఁజేసి నీభక్తవరుని,
రక్షింపవే! నీసమక్షభాగ్యమునాక
నుక్షణమరసి యనుగ్రహించి,
దయసేయవే! మహోత్తునదయాభరమున
నాశ్లిష్టతల మానసంబుగాగ,
పాలింపవే! కృపావాహినీతతిరచి
యించి, వీచికల దేలించి నన్ను,

గీ. తామసంబుగల్గు తరుణిభవాని, న
ర్ధాంగమందు దాల్చి నట్టి నేను,
శాంతభావవైన కాంతను నిన్ను నా
తలను దాల్చి పూజ సలుపఁదగదె?

నార — శంకరా! ఈమాటలను పార్వతి వినెనేని ప్రమాదములలో నెల్ల ప్రమాదము సంభవించునుగదా!

గంగ — మహాదేవా! నీదయారసము గోరివచ్చినదాననేకాని, నిన్ననుగ్రహించుటకు నే నెంతదానను—

(తెరలో)

నారదా! ప్రత్యుత్తర మీయవేమి? నేను రావచ్చునా?

నార—అయ్యయ్యో! విలయకాల మేదియో రానే వచ్చినది. శంక రా! గంగ నింకనైన వదలవయ్యా! భాగీరథీ! నీవైన మరల మగవేషము వేసికొని యుండవమ్మా! పార్వతీదేవి వచ్చి పడుచున్నది!

(దుస్తు లందిచ్చుచున్నాఁడు.)

శంక—(లాగికొని యావల బారవేసి) ఛీ! ఛీ! ఈసుందరమూర్తికా నాటకవేషము వేయుమనుచుంటివి?

గీ. భువన సమ్మోహనానంద భవద శేష
కోమలానూన సౌందర్య సీమయైన,
రంగదమలతరంగయా గంగ కేడ?
పగటివేషంపు పురుషరూపంబదేడ?

(తెరలో)

శాంబరీమంత్రి) మిప్పటికి సొంతమై యుండును. వైద్యశిరోమణీ! నేను వచ్చుచున్నాను.

నార—అదిగో! పార్వతీదేవి వచ్చుచున్నది! మీరు నా మాటలను పెడచెవినిఁ బెట్టితిరి! ఈ కష్టమునుండి యిప్పుడు తప్పించుకొనుఁడు.

గంగ—నారదమునీంద్రా! పార్వతిపేరు చెప్పి నన్ను బెదరించుచుంటివా! రానిమ్ము. ఏమిచేయునో చూచెదను.

నార—నాకెందులకమ్మా! మీయిష్టము.

[పార్వతి ప్రవేశించును.]

పార్వ—వైద్యశిరోమణీ! మంత్రజపమైనదా! (చూచి తెల్లపోవుచున్నది.)

నార—(తనలో) ఇప్పుడుగదా! నాకానందము; ఇప్పుడు నాకు మంచికలహాభోజనము దొరికినది.

పార్వ—(కోపముతో) ఓమాయలాడీ! నీవా వైద్యరూపధారివై వచ్చినది! సిగ్గులేదా?

గంగ—సిగ్గులేకపోవుటచేతనే శివశక్తివైతివి!

పార్వ—నారదా! ఏమి యీ దుస్తంత్రము! ఇదియంతయు నీమా యోపాయమేనా?—

నార—అమ్మా! నే నేమియు నెఱుఁగను; బాలవైద్యుడునమ్మదగిన వాఁడు కాడని ప్రథమముననే చెప్పితిని. నామాట నీవు పాటించితివా! (శివుని జూపి పార్వతికి కనుసంజ్ఞ చేయుచున్నాఁడు.)

పార్వ—ఓహో! ఇదియంతయు (శంకరునిజూచి) తమశృంగారనాటకమేనా? పెదవులు దడుపుకొనుచు నిలువఁబడెదరేమి? నే నశ్వినీదేవతలకై కబురంపగా నాప్రయత్నమును భంగముచేసి, నాకు గర్భశాత్రవురాలయిన యీగంగను వైద్యరూపమునఁ బిలిపించుకొని, కులుకవలయు ననుకొంటిరా! పార్వతి యేమయ్యెనని తలంచితిరి? ఈ తొత్తును నెత్తిపై నెక్కించుకొని యూరేగదలంచి, వెఱ్ఱిమెత్తినదని వేషమువేసితిరా! ఆహాహా! ఏమిసరసముగనున్నది! ఎంతగౌరవముగ నున్నది!

శంక—ప్రేయసీ! కోపగింపకుము. ఇందున నే నేమియు నెఱుఁగను. ప్రమాణము చేయుమన్నను చేయుదును.

పార్వ—ఇంతసాహసమునకు తెగించినతరువాత నింక నే ప్రమాణముల కేమికొదువ?

నార—అమ్మా! అబద్ధముగాదు. ఈ సదాశివుఁడు గంగను నెత్తిని బెట్టుకొని ప్రమాణముచేయుమన్నచో నిమిషములో జేయఁగలఁడు.

పార్వ—ఆ! ఆ!! ఎంతకౌటిల్యము! ఎంతసాహసము! ఆ మాట స్పష్టముగ నాచెవిని వేయుచుంటివా నారదా! నీవు సజ్జనుడ వనుకొని మోసపోయితిని. మీరంద ఱొకతంత్రమునందే చేరి, నన్ను మహావమానముపాలు చేయదలంచితిరి! శూలధరా! ఇంకనైన నీగంగ నావలకు బంపెదవా లేదా?

శంక—నీవు పిలువనంపితివిగావున, నీవే పొమ్మనుము.

పార్వ—నేను భిషజ్మణిని పిలువనంపితినిగాని, యీ కుటిలురాలిని బొట్టునుఁ గాటుకయుఁ బెట్టి పిలిచితినా?

నార — భిషజ్మణిని పిలిపించితివో, విదుషీమణిని పిలిపించితివో, ఇప్పు డీవితండవాద మేలనమ్మా ! ని న్నెవరు పిలిచిరని గంగ నే యడుగరాదా ?

శంక — (స్వగతము) ఈ నారదుఁడు కలహము నధికముచేయుచు న్నాఁడు.

పార్వ — ఓసీ ! లజ్జావిహీనురాలా ! నా మందిరమునకు నిన్నెవ్వరు రమ్మనిరి ?

గంగ — నీ మందిరమని వచ్చినవా రెవ్వరు ? భ_క్తపరాధీనుఁడగు శంకరుని దర్శింప భక్తురాలనగు నేనే వచ్చితిని. ప్రశ్నింప నీవెవ్వ తెవు ? పొమ్మా.

పార్వ — ఏమీ! నీవు భక్తురాలవా! ఓసి వంచకురాలా! దొంగవేషము వేసి లజ్జను విసర్జించి తగుదునని మగరూపముదాల్చి నా యాజ్ఞలేక నాయిల్లు జొచ్చుట భ_క్తివశమున నేనా ? ఆడుదాని కింతకన్న నవమానమముగలదా? మొండితనమున నాతో వితండవాదము సాగించితివా ? పొమ్మా నాయిల్లు కదలి.

గంగ — ఓసీ యజ్ఞానురాలా ! ఈర్ష్యాపరవశురాలా ! నీతో నేనేమని పంతము వహించితినో యెఱుంగవా ? నీ భ_ర్తశిరము నెక్కినీకు సవతినిగాక నేనూరక వెడలిపోవుదునా ?

పార్వ — ఆ! ఆ! అంతపని చేయుటకే వచ్చితివా ?

గంగ — సందేహమేమి ?

పార్వ — ఛీ దుర్మార్గురాలా ! నీమొగము చూడరాదు.

గంగ — పాపాత్మురాలా ! నీపేరు దలంపరాదు.

పార్వ — నిను శపించి మారణముచేసెద చూడుము.

గంగ — నిను మాయించి మసిచేసెదనుండుము.

పార్వ — తులువా ! కన్నులు తలకెక్కెనా ?

గంగ — తులువ నీవలెనే మిడిసిపడుచుండును.

పార్వ — పాపినీ ! నీ కింతపంతమా !

గంగ — కోపినీ ! నీ కింతగావరమా !

(అనుబంధము ౫౬.)

పార్వ—నాథా! నాథా! నీవు దగ్గఱనుండియు నీ యర్ధాంగినియగు నన్నిట్లవమానింపజేసెదవా! ఇది నీకు న్యాయమనితోఁచెనా?

శంక—దైవమా! నాకెట్టిదురవస్థ దెచ్చిపెట్టితివి? నా కిప్పు డేమియుఁ దోఁచుట లేదు.

నార—(తనలో) కట్టుకొనకముందే యింతకష్టము గల్గుచుండఁగా-నిద్దరు భార్యలవారి కెంతకష్టమో!

పార్వ— ఇప్పుడు మీ కేమితోఁచును. (ప్రచ్ఛన్న) తనగుమ్మముదాటి వచ్చి యొకగయ్యాళి తనభార్య నడ్డమయినమాటలనుచుండగా మరియొకపురుషుఁ డూరకుండఁగలఁడా! నాపై నీకుఁగల యభిమానమునకు నిదర్శన మిదియేనా? దానిని నెత్తిపైఁ బెట్టుకొందువా! నన్నడమకాలిమడిమెతో నేలరాతువా? నాకన్నుల నీరు గారఁగా వీక్షించుట నీకానందమా!

గంగ—నీదుర్గతికి నీ వేడ్వవలసినదే కాని, నన్నుదూషింప నీకేమి నిమిత్తము?

పార్వ—(రోషముతో) ఓసి! రాకాసి! నీ వేడ్పించుదానవును నే నేడ్చుదాననా? అంతలో నదృశ్యమైతివిగాని, కానిచో నాడే నిన్ను భస్మీపటలము చేయజాలకుంటినా?

గంగ—నీవు చేయగా భస్మీపటలమైనవారే నీమగఁడు తిరుగుశ్మశానములం దేడ్చుచున్నారు! వట్టిప్రతాపములను మాని నోరు కట్టుకొనుము:

పార్వ—ఓసీ! నాయింటికివచ్చి నన్ను ధిక్కరించెదవా దుర్మతీ! కదలెదవా లేదా?

గంగ—కదలకున్న నేమిచేసెదవు?

పార్వ—అర్ధచంద్రప్రయోగముచేసి యావలకు గెంటెదను.

గంగ—పూర్వమైనపరాభవము చాలకనా? పూర్ణగర్వభంగము కావలెనా?

పార్వ—నాకా గర్వభంగము?

గంగ—ఓర్వలేమిగల నీకుగాక నాకా ?

పార్వ—ఇదె చూడుము; అట్లయిన గర్వభంగ మిప్పుడే చేసి పంపెదను.

గంగ—నోటికివచ్చినదెల్ల మాటయేనా ?

పార్వ—నోటికివచ్చినదెల్ల మాటగాదేని చేతికివచ్చినదెల్ల వ్రేటే. నిన్నిఁక నిందుండనీయరాదు. ఆవలబొమ్ము.

(అనుబంధము ౫౭)

(గెంటివేయుచున్నది.)

[విష్ణువు ప్రవేశించును]

విష్ణు—గంగా ! గౌరీ ! ఏమి యీసాహసము ! శాంతినందుఁడు ! శాంతినందుఁడు !

పార్వ—ఈనిర్భాగ్యురాలు కన్నులయెదుట నున్నంతవఱకు గౌరికి శాంతముండదు.

గంగ—శాంతములేనిచో సాంతమగుదువు.

పార్వ—పలువా ! పలువమాటలు మానవా?చూడు నాప్రతాపము. నిన్నేమిచేసెదనో !

విష్ణు—(అడ్డుకొని) గౌరీ ! నీ కీవిజృంభణము కూడదుసుమా ! ఏమందువేని,

ఉ. నీపతి దుర్విషానలవినిందితతప్తశరీరుడయ్యె నీ
తాపము వాయుమార్గ మిఁక తప్పదు గంగను గూర్చుటొక్కటే
కోపముబూని యీసతి నకుంఠితనిష్ఠురభాషలాడి నీ
వేపున వైరముం బడసెదే ! యిది నీకు హితంబె ? పార్వతీ !

పార్వ—జగన్నాథా ! నీవుసయితం మీకుట్రలో చేరుదువా ? ఈమహేశ్వరుఁడు గంగపైఁగలమోహమున కపటవిషతాపం బభినయించె నేగాని యిది నిక్కమగునా ? ఒకవేళ నగుఁగాక ! ఐనను నాతపశ్శక్తినైన ధారపోసి యీవ్యాధి మాన్పెదగాని యీ గంగను నాపతి నెత్తిపై నెక్కనిత్తునా ?

గంగ—ఓహోహో ! పెద్దపులు లిఁక జపముచేయుట కారంభించును

గాంబోలును! నీకా తపశ్శక్తి! సిగ్గులేని మొగమునకు నవ్వే సింగారమట!

పార్వ—హుం. ఏమంటివే దుష్టురాలా! నాకుఁగాక నీకా తపశ్శక్తి? చక్రపాణి గలడని మరింత నోరువిప్పితివా? నిన్నేమి చేసెదనో చూడుము. (అట్టహాసముచేసి మీాదికి రాబోవును.)

విష్ణు—పార్వతీ! ఈభాగీరథి నాకూర్మితనయ. నాసహాయమున్నంతవఱకు నీ వీమె నేమియుం జేయలేవు! ఏల నీప్రతాపము! అదిగాక, గంగను నీ వేమని తలంచు చుంటివో! ఆమె మహా మహిమాన్విత!

పార్వ—దేవా! ఎంత జగత్కర్తృత్వమున్నను అభిమానము నిన్ను వదలదయ్యెనుగదా? గంగ మహిమాన్వితయా? ఆహాహా! ఏమి దీనిమహిమ! కొంగ తాపసి యగునేని నక్క విరాగి యగునేని యిది మహిమగలదగును.

విష్ణు—ఏమిశంకరా! పార్వతి నన్నుఁ సయితము తృణీకరించుచున్నది. కాంతాజనములకు చనువు లింతగా నీయవచ్చునా?

శంక—దేవా! బ్రహ్మ యీపార్వతిని శక్తిస్వరూపిణినిగా సృష్టించి యుండ నేనేమి చేయుదును.

నార—దేవా! పద్మనాభా! ఈశంకరుఁ డొకఁడే కాడు! ఆడువారి శాసనమున కడుగుదాటగల మగవాడే నాకింతవఱకు కనబడ లేదు. ఎవరివఱకువచ్చినప్పుడు వారు వగచుట. ఇతరవేళల పరులకు హితోపదేశములు చేయుట!

పార్వ—బ్రహ్మచారివి నీవు సయితము పడతులగుణము లెన్నవచ్చితివా? చాలుజాలు నూరకుండుము.

నార—అమ్మా! గట్టిగ బుద్ధిచెప్పుకొందును. గర్వభంగ మయినగాని నా కీమిడిసిపాటు తగదు.

విష్ణు—పార్వతీ! నీవు గంగామాహాత్మ్యము నెఱుఁగవలయునందువేని చూపెదను. నాపలుకు లభిమానప్రేరితములు కావని నీ వెఱుంగఁగలవు.

గీ. కుష్ఠురోగి యొకడు ఘోరబాధావరి
చ్ఛన్నదేహుఁ డగుచు నున్నవాఁడు
వానిబాధ లెల్ల భాగీరథీ మహా
త్మ్యమున నడగు టిప్పుడరయఁగలవు.

(తెరలో)

(అనుబంధము ౪౯.)

నార—దేవా! ఆకుష్ఠురోగి యిపు డిందే వచ్చుచున్నాఁడు.

[కుష్ఠురోగి ప్రవేశించును.]

(అనుబంధము ౪౯.)

సాగ—ఆహాహా! ఏమి నాభాగ్యము! ఏమి నాభాగ్యము!! శ్రీమన్నారాయణనారదశంకరులను, గంగాగౌరుల నొక్క-చోఁగాంచితిని. నాజన్మము సార్థకమయ్యెను. ఇంక నా కీదుర్భరవ్యాధిబాధలు గలుగునా? నారదమునీంద్రా! నీయాశీర్వచనమును స్థిరపరచుకొమ్ము. నారాయణా! నీపాలబడితిని. నన్ను రక్షింపుము. శంకరా! నా సంకటముం బాపుము. భవానీ! నా భయంబు దీర్పుము. గంగా! కృపాంతరంగవుగమ్ము. జన్మాంతరపాపభరంబువలన నిష్ఠురనికృష్టమహామయకష్టంబుల పాలైతిని. మీకందరి కివే పునః పునః ప్రణామములు గావింతును.
(హరహర అనిపాడుచు ప్రదక్షిణ నమస్కారములుచేయును.)

విష్ణు—సాగరా! భీతిదక్కు-ము! ఈ గంగాదేవిదయారసముచేత నీ కష్టంబు తొలగును. భాగీరథీ! నీమహిమచేత నీసాగరుని కష్టంబు నివారింపుము.

గంగ—శ్రీమన్నారాయణా! నీయనుగ్రహమే నామహిమకుఁ గారణము! నీపాదపరిచర్యచే ధన్యాత్మురాలనైన నా కీయశంబును గూర్పదలంచి నా కిట్లాదేశించితివి. ఇప్పుడే యీతనికి సుందరదేహంబు నిచ్చుటయేకాక పరమపదప్రాప్తియుఁ గలిగింతును.

(అనుబంధము ౫౦.)

(సాగరు లంటగా నాతడు దివ్యశరీరముతో నిలచును.
పైనుండి విమానమురాగా నాకాశమున కేగును.)

విష్ణు—పార్వతీ! గంగామాహాత్మ్యము నిప్పుడైన నెఱింగితివిగదా?

(అనుబంధము ౫౯.)

పార్వ—నా కీవ్యూహరచనమంతయుం దెలియును. గంగపై నభిమానమున నీవీగారడి చేయించితివి. ఏమైనసరే! గంగకు నే నాధిక్య మీయను.

విష్ణు—నామాట వినవా?

పార్వ—నాయభిమానము హతమగునప్పు డెట్లువినగలను?

విష్ణు— నీ వీగంగను నిరాకరించితివేని నీపతి కీతాపము మానదు సుమా!

పార్వ—అందులకు నా తపశ్శక్తి గలదు.

విష్ణు—పిదప పశ్చాత్తాప పడవలసివచ్చును సుమా?

పార్వ—నామంచిచెడ్డలు నాకు తెలియును.

నార—అమ్మా! పార్వతీదేవీ! శ్రీమన్నారాయణుఁ డిట్లు స్వయముగా వచించునప్పుడు నీ కిపంతము కూడదు. వినుము. వినుము.

(అనుబంధము ౬౦)

పార్వ—నారదా! నీదొంగవేషములు నాకు తెలియునులే. నీవూరకుండుము. (అనుబంధము ౬౧)

విష్ణు—చెప్పదగినంత చెప్పితిని. పార్వతీ! ఇంక నాప్రయత్నము లేదు. తుదకు నీపతి హాలహాలతాపము గంగాప్రసాదమున నేయణంగ గలదు. గంగావతరణముతోగాని నీ గర్వభంగనాటకము పరిపూర్ణముకాదు. ఇప్పుడు నా కీకంఠశోష యెందులకు? ఇంతదనుక గంగాసాన్నిధ్యమున నుండుటచే శంకరునకు విషతాపము లేకుండెను. గంగ యీస్థలము విడువనిమ్ము. అతని పాట్లు చూచెదవుగాక! బిడ్డా! భాగీరథీ! మన కీపార్వతితో నేమి రమ్ము. (అనుబంధము ౬౨)

(గంగ, విష్ణు నిష్క్రమింతురు.) (తెరవ్రాలును.)

[పార్వతి, చెలులు, ప్రవేశింతురు]
అనుబంధము ౬3)

పార్వ—చెలులారా! నే నేమిచేయుదును? నాసంతాపమున కంతము గలుగదాయెను గదా?

సీ, గంగావగాహంబు గావింపగా జని
యలుకమై వాదంబు సలుపునాడు
పురుషాకృతినిదాల్చి మోసగించినగంగఁ
వంచనంబు నిరాకరించునాడు
మోహినీరూపంబు బూనినవిష్ణువు
పలుకులైనను చెవి నిడనినాడు
హరుమూర్ధమునగంగ యవతరించిన తాప
మణగునన్న సరకు గొననినాడు
గలుగుధైర్యమందున లవంత యేనియు
గానుపింపదమ్మ కాంతలార!
గంగనిపుడె తెచ్చి శాంతునిశిరముపై
జేర్తునా? మరేమిసేతునమ్మ.

1 చెలి—అమ్మా! ఎంతవిపరీతముగ మాటాడుచున్నారు. పట్టుదల యందు పేరువడిన మీ పలుకు లేనా యివి?

2 చెలి—తల్లీ! ఇంతకాలము దానితో వైరముంబూని, యింతరాద్ధాంతసిద్ధాంతములు చేసి యిప్పుడు లొంగిపోయెదరా?

3 చెలి—ఇంతగా దీక్షనింత జరిగినను మీరు గంగకు లోబడిపోవుట మాత్రము మాకిష్టము లేదు.

4 చెలి—ఊరుపేరు లేని, చేతవాతగాని గంగయేమి? మిమ్ము గెలుచు టేమి తల్లీ.

5 చెలి—అమ్మా! మీకింతలో నింత యధైర్యమా? హృదయమును చెదరనీయకుడు. మీకు గంగతోఁగలబలవద్వైరానుబంధమును స్మృతికిఁ దెచ్చుకొనుఁడు.

6 చెలి—దేవీ! పలువురుచేరి మీకు పరాభవము గలిగింపదలచి

యీా చిత్రచర్యలు గావించుచుండిరి. దీని నెఱేఁగి మసలు కొనుఁడు.

పార్వ—చెలులారా! నే నేమి చేయుదును? నానాథుని ప్రాణములు విషపానవశమునఁ దల్లక్రిందు లగుచున్నవి. బ్రహ్మాదిసురలోక మంతయు స్తుతించి నాపతిచే విషము ద్రావింపఁజేసి యిప్పు డొక్కరును మాటాడరుగదా! ఎవ్వరి నడిగినను గంగావతర ణమే కావింపదగినయుపాయమని పలుకుచున్నారు. కాని యాగంగనుమాత్రము నేను నాపతిం జేరనీయను. ఇదియే నిర్ధారణము. నా హృదయేశ్వరుఁడు నిరామయుఁ డగు నుపాయమే నాకుఁ దోఁచుట లేదు.

1 చెలి—అమ్మా! అందులకై విచారమేల? అతీతమైన తపశ్శక్తి యెంతకుఁ జాలదు?

పార్వ—చెలులారా! అట్లయిన నేను ఘోరతపం బాచరించి, నానా థుని విపత్తునుఁ దొలగించెదను. కాని, నాతపంబు నడుమ భంగమయ్యెనా ఫలింప నేరదు.

2 చెలి—అందుల కెవ్వరినయిన శస్త్రసహితముగ నీతపోమందిరమున కడ్డముగనుంచిన నుచితముగ నుండును.

పార్వ—ఎవ్వ రున్నారు! భృంగి పిరికిపంద. నంది యుపాయమెఱుం గఁడు.

3 చెలి—అట్టి వీరుని నయితము నీశక్తిచేతనే సృజింపరాదా?

పార్వ—ఔను సుమా! మట్టిబొమ్మ నొకదానిని చేసి ప్రాణప్రతిష్ఠ చేయుదును. ఓసీ జయంతీ! నీవరిగి కొంతమృత్తికను సంపా దించుకొని రమ్మ?

4 చెలి—అమ్మా! నీ వభ్యంగనము చేసినప్పుడు నీయొడలు నలిచిన నలుగుబిండిగలదు. తెత్తునా?

పార్వ—తెమ్మ. ప్రాణప్రతిష్ఠ చేయుదునుగదా! ఏ దయిననేమి?

4 చెలి—(తెచ్చి) అమ్మా! ఇదిగో నలుగుబిండి.

పార్వ—(బొమ్మగా నొనరించి) ఓం సర్వమంత్రక్రియాపాటవశక్తి

స్వయంభూ! ఓం ప్రచండదివ్యమహిమాన్వితసర్వసృష్టి చాతురీ స్వభావా! ఓం దంతదంశనిమాత్రాశేషరక్షఃపిశాచ శాకినీ ఢాకినీసమూహా సంక్షోభితచక్రహస్తా! ఓం ఫట్, ఓంహాక్ ఓం భూ, ఓం భూ, ఓం భూ, (మంత్రోచ్చాటనము చేయగా, విఘ్నేశ్వరుఁడు పుట్టును.)

విఘ్నే — (అనుబంధము ౬౪)

తల్లీ! నన్నేలకల్పించితివి. వేగ సెలవీఁగింపుము. ఏదుష్టాత్ముని సంహరింపవలయును? నాకరవాలాఘాతంబున వాని గీటడంతును.

పార్వ—కుమారా! నే నొనరింపఁబోవు ఘోరతపంబునకు విఘ్నము గలుగకుండుటకై నిన్ను గల్పించితిని. కావున నీవు విఘ్నేశ్వరుండని పిలువఁబడెదవు. (కత్తినిచ్చి) ఈకరవాలంబును గైకొని ద్వారంబున నుండుము. లోని కెవ్వరిం జొరనీయవలదు. ఎవరైన నిన్నెదిరించిరేని నీపరాక్రమంబున వధింపుము.

విఘ్నే—తల్లీ! అట్లే సలుపుదును.

పార్వ—చెలులారా! మీ రందఱు నాకుమారుఁడగు విఘ్నేశ్వరునకు మంగళాశాసనము గావింపుఁడు.

(అనుబంధము ౬౫)

చెలులు—(మంగళాశాసనము చేసి నిష్క్రమింతురు.)

పార్వ—బాలకా! నీ వీకకార్యనియుక్తుండవు గమ్ము. నేను తపంబు చేయఁబోవుదును. (నిష్క్రమింతురు)

విఘ్నే—ఈ కృపాణము నాచేతనుండగా నన్నెవ్వఁ డెదురింపఁగలవాఁడు? ఈద్వారమును నామాతృశాసనము ననుసరించి సంరక్షించెదఁగాక! (అటునిటుఁ దిరుగుచుండును.)

శంక—(ప్రవేశము.) (అనుబంధము. ౬౬)

అగ్నిహోత్రజ్వాలల నాహుతిగావించెదను. విషానలజ్వాలాకరాళభీషణభుజంగశ్రేణితోడ క్రీడించెదను. ద్వాదశార్కమండలమరీచిజాలంబుల దగ్ధముగావించెదను. ఇదియే సర్వబ్రహ్మాండవిలయసమాసన్నసమయము. నవగ్రహకూట మహారిష్టకాలము

త్రింశత్కోటిదేవానీకమానసప్రకంపనమహాలయ కాలము. సప్తజంఝామారుత సంవర్తక మేఘమాలికా సంఘట్టన సమయము. అనంతతారకాసహితోల్కాపాతవిపరీతతరుణము. సప్తసముద్రము లేకంబులై ఘూర్ణిల్లవలె — కులపర్వతంబులు దిర్దిరం దిరుగవలె — సహస్రకరపరివేషమండలము సంపూర్ణ మహానలప్రేరితంబుగావలె — ప్రళయకాలాభీలాస్మదీయ ఫాలలోచనానలశతంబుం బ్రజ్వరిల్లజేసెదను — సమస్తజీవన సంహారకకాలపాశసదృశాస్మదీయ త్రిశూలాగ్రనిశితధారలం బ్రహ్మాండంబు పటాపంచలు చేసెదను — నా కెదురాడువాడెవ్వఁడు.

(అనుబంధము ౬౬)

విఘ్నే — (తన) ఎవడో యొకడు గంతులు వేయుచు నిట్లు వచ్చుచున్నాఁడు! వీనిని నిరోధించెదను.

శంక — ఓరీ — పార్వతి యేదిరా?

విఘ్నే — మూర్ఖుఁడా! మాయమ్మను మర్యాదావిరహితంబుగ సంభాషింతువా! —

శంక — ఓరీ! అంగుష్ఠమాత్ర ప్రమాణముగల నీవా నన్నెదురించువాడవు — ఎవఁడవురా నీవు?

విఘ్నే — నేను పార్వతీదేవి కుమారుఁడను.

శంక — పార్వతీదేవి కుమారుఁడవా! — ఎవనికి బుట్టితివిరా నీవు?

విఘ్నే — నాకు ఎవనికో పుట్టవలయునా? నాకు నేనే పుట్టితిని.

శంక — మీయయ్య యెవఁడు?

విఘ్నే — అయ్య యెవడున్నాఁడు! అమ్మ పార్వతి — నీ వెవ్వఁడవు?

శంక — నేను నీకు నాశంకరుఁడనురా!

విఘ్నే — ఆ — ఆ — ఇంకను నిందాభాషణము లేనా?

శంక — పార్వతి యెక్కడ?

విఘ్నే — ఆమె తపస్సు చేయుచున్నారు. కాని నీదుర్వినయమునకు నిన్ను సంహరించెదను.

శంక — ఛీ! — ఏమంటివిరా! నన్ను సంహరించెదవా? నిన్నేమి చేసె

దనో చూడుము.

విఘ్నే—కారము నములిన క్రోతివలె గంతులు వేసెద వేమి? నీ విం కనొక్క యడుగు కదలగూడదు.

శంక—నేను పార్వతితో మాటాడవలెను. ద్వారమునుండి తొలంగుము.

విఘ్నే—నేను తొలంగుటకుపూర్వమే నీ శిరస్సును శరీరమునుండి తొలంగించెదను.

శంక—దుర్మతీ! నీపట్ల నిక శాంతింపరాదు. రమ్ము. ఇదిగో శూలము

విఘ్నే—నీకు శూలమున్న నిదిగో నాకరవాలము.

(శంకరుడు విఘ్నేశ్వరుడు యుద్ధము చేయగా శంకరుడు విఘ్నేశ్వరుని చంపును.)

శంక—(దర్పముతో) ఈపంద హతాసువయ్యెను—గతాసువయ్యె-నన్నా! వీఁడెదిరించునది—ఏది పార్వతి! ఇందెందునుఁ గాన్పింపదే! ఈశక్తి యిప్పు డేదనుజసంహారమునకై చనినదో కదా? (చూచి) లేదు—లేదు—ఇందు ముక్కుమూసికొని, కొంగ జపము చేయుచున్నది. ఈజపము నేను విఫలము జేసెదగాక!

(వీపుపైఁదట్టి) పార్వతీ! పార్వతీ! లెమ్ము—లెమ్ము—

పార్వ—(త్రుళ్ళిపడి లేచి) ఎవరు నాతపోభంగముగావించినవారు?

శంక—ఇంతకన్న సమర్థుడింకొకఁడెవ్వఁడు! నేనే.

పార్వ—హా! హా! ఏమి వికృతాకారము!

శంక—నాయాకారమున కేమిగాని, నీ కీవికార మేమి? ఈ కొంగ జపమేమి?

పార్వ—మీ రెట్లు లోనికిరాగలిగితిరి?

శంక—సర్వజ్ఞుఁడ నగు నాకొకరి యాటంకమా!

పార్వ—విఘ్నేశ్వరుఁడు రానిచ్చెనా?

శంక—ఈ మహేశ్వరుని ప్రతాపమునకు విఘ్నేశ్వరుఁడు నిలువ గలడా! వానిని రెండుముక్కలు చేసితిని. ఇదిగో రక్తము అదిగో శవము.

పార్వ—హా! కుమారా!—(మూర్ఛిల్లును)

శంక—హాహాహాహా వావావా (నవ్వి) ఇన్ని దినములకు నాతో పార్వతి పరిహాసము లారంభించినది. కుమారుఁడఁట! మరణించెనఁట? అందులకై తనకు శోకమఁట! మూర్ఛలఁట! వింతయైనవింత! చమత్కారకథ! చక్కనిదిపిన్నాట!! వహ్వా! వహ్వా! పార్వతి యెంతచమత్కారములు నేర్చినది. అదిగో! కదలుచున్నట్లున్నది. నేను నిశ్శబ్దముగ నుండి యీపార్వతి పరిహాసమునకు బ్రతిపరిహాసము గావించి నానేర్పు చూపెదను.

పార్వ—(లేచి) హా! కుమారా! అయోనిసంభవ! పోయితివా! నన్నువిడనాడిపోయితివా! జనియించినకొలదికాలముననే నీకు మరణము గలిగెనా! ఉన్మత్తుండగు నీ తండ్రి నిన్నుఁ బెంగక సమయించెను. చాలునురా తండ్రీ! అల్పాయుష్కుండ వగుటచేతనా నీవంతటి మహాతేజమున మొలసిపోవుచుంటివి! హా! కుమారా! విఘ్నేశ్వరా!

శంక—పార్వతీ! ఈ యాటను నీవెవ్వరివద్ద నేర్చుకొంటివి.

పార్వ—హా! దుర్విధీ! నిన్నేమందును. నాథుఁ డున్మత్తుఁడయ్యెను. నందనుడు మరణించెను. నేనుమాత్ర మేల జీవింపవలయును. (తలగొట్టుకొనబోవును.)

శంక—(పట్టుకొని) ఆ! ఆ! పార్వతీ! ఎందులకీయాత్మహత్య నీకు?

పార్వ—నాథా! నాకుమారుని చంపినవారు నన్నుగూడఁజంపి నా కీయాత్మహత్యాపాతకము రాకుండఁజేయుము.

శంక—నీకుమారుఁ డెవ్వఁడు? నిజము చెప్పుము.

పార్వ—ఏసుగుణరత్నాకరుని, ఏసుందరాంగుని మీపొట్టను బెట్టుకొంటిరో యావిఘ్నేశ్వరుఁడు.

శంక—వాడు నీ కుమారుఁడా! ఏమి! వానిని బట్టుకొనినదయ్యమే నిన్నునుఁ బట్టుకొనెనా? వాడు నీ కొమారుఁడైనచో నెవ్వనికి బుట్టెను?

పార్వ—అకటకటా! ఎట్టిమాటలు విననయ్యెను! కొంతదుస్థితిగన

నయ్యెను ?

శంక—(శిఖపట్టుకొని) చెప్పుముపలువా ! నీవు జారిణివైయుందువు. ఆవిఘ్నేశ్వరుఁడు నే నెఱుఁగకుండ నీకెట్లుపుట్టెను ?

పార్వ.—అయ్యో ! నేనేమిచేయుదును. హాలాహలతాప మీాయన కు నేడధికమైపోయినది. ప్రాణాపాయమే సంభవించినది.

శంక—చెప్పవేమి ? వాఁడెట్లుపుట్టెను ?

పార్వ—నలుగుబిండితోడ విగ్రహమును సృజించి, ప్రాణప్రతిష్ఠచేసితిని, నేనింతకన్న నన్యమెఱుంగను.

శంక—ప్రాణప్రతిష్ఠచేసితివా ! అయోనిసంభవుడా విఘ్నేశ్వరుఁడు?

పార్వ—ఔను.

శంక—హా ! హా !! తుదకు, కుమారహంతనైతినా ? దుష్టచరిత్రుఁడనైతినా ? కుమారవధామహాపాతకము, నాకు గార్చిచ్చుయి చుట్టుకొనునుగదా ! హాలాహలమహాతాపమునకుఁదోడు కలుషార్జితపాపం బగ్నిహోత్రంబయి నన్ను గాల్చివేయును గదా ! శంకరుఁడనని జంకక త్రిపురాంతకుడ నని ధీరతమానక, విశ్వేశ్వరుడనని వెఱువక, ఫాలనేత్రుడనని భయపడక యమకింకరులు, శంకాతంకములుమాని, విశంకటవృత్తిని వహించి, యహంకారమున భయంకరులై నన్ను బాధింతురు. గదా ? సర్వలోకమిత్ర ! అగ్నిహోత్రా ! నన్ను దహింపనున్నావు. నాలోనుండియు నాపై ననుగ్రహముమానియున్నావే ! ఇది నీకు హితమా ? ఎందైననమ్మతమా ? కాక నాపురాకృతమా ? నాయనా ! నాచిట్టితండ్రీ ! నిన్ను త్రిశూలాఘాతంబులపాలుగావించినకట్టిడినే నేను ! నన్ను పిశాచమవైవచ్చి భక్షింపవా ? ఈరక్తమున దొరలుచు నెంతభీభత్సముగా నుంటివోతండ్రీ !ఓరీ! దుష్టా! దుర్మతీ! ! నాకుమారునిఁజంపిన నీవెవ్వడవురా ! మదీయత్రిశూలానలజ్వాలల నిన్ను భస్మీభూతశరీరునిగావించెదను చూడుము. ఏడీ ! ఎవ్వఁడునుఁ గాన్పింపఁడే ! హాహాహా ! కాదుకాదు. ఎవఁ

డోదుష్టుఁడు నాకుమారునిఁజంపి, నన్ను పరిభవించి యీవి ధముగాఁ బరిహసించుచున్నాఁడు. (కోపముతో) దురాత్మా! నీకపటస్వభావంబు నెఱింగితినిలేరా! పాపీ! నిన్ను చంపి శాకినీ సంతానమున కాహారముచేసెదను.

(మూర్ఛిల్లును)

పార్వ—నాథా! నాథా!! అకటా! నాగతి యీరీతి నయ్యెనా, ఓసీ! గంగా! నీవెంతహాంతకారివే. నీమూలమునగదా నా కీగతి సమకూరినది! నేనిప్పుడేమిచేయుదును ఎంతశాంతి వహింతమన్నను హృదయేశ్వరుని యున్మాదమున కేమిచే దును? బ్రహ్మాదిదేవతలందఱును పట్టుదలవహించి నన్ను పరి భవింపసమకట్టిరా! తపంబు దగ్ధమయ్యె, కుమారుడు కూలి పోయె, పతి యున్మాదుఁడయ్యె, ఇకనేదిమార్గము, నాగతి యేమగునోకదా, ఎవరో యిటువచ్చుచున్నారు.

[అశ్వినీదేవతలు ప్రవేశము.]

అశ్వి—పార్వతీదేవీ! మే మశ్వినీదేవతలము.

ఆ. కాలకూటవిషముఁ గబళించి యీశుఁడు
నున్మాదుఁడగుట నెఱిఁగి మహితమైన
యౌషధంబునొసఁగి యతనితాపంబు న
ణంపవచ్చినార మంబ మేము.

పార్వ—మహాత్ములారా! మీపాదంబులంబట్టిప్రార్థింతును మహేం ద్రునకు మిమ్ముఁబంప నిదివఱకేవార్తనంపితిని. అప్పుడు గంగ పురుషాకృతితో నరుదెంచి మమ్ము మోసగించి యింతజేసెను. నానాథునకు జీవప్రదానము చేయుఁడు. నన్నురక్షింపుడు.

అశ్వ—(నాడి చూచి) ఓహో! ప్రమాదము సంభవించినది, తల్లీ!

గీ. హరజటాజూటమున గంగ యవతరింప
నఖిలతాపంబు లీతని కణగునమ్మ
కాకయుండిన లోకజాము కాలమునకె
యితఁడు హతజీవు డగును గిరీశతనయా!

పార్వ—హా ! దైవమా ! (మూర్ఛిల్లును.)
1 అశ్వి—ఈ వార్తను దేవేంద్రున కెఱిఁగింతము రమ్ము.
2 అశ్వి—అట్లే చేయుదము.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

(అనుబంధము. ౬౭)

నార—(ప్ర॥) ఇదిగదా చక్కనిసమయము ! పార్వతీగర్వభంగకాల మాసన్నమైనది. ఈ రంగము గడచినతోడనే గంగావతరణ ముం గన్నులార వీక్షింపఁగలను,

మ. మదిరంజిల్ల చమత్కృతు ల్వలిపి, రమ్యంబైన, గంగావతా
ర దశం గాంచగబన్నినట్టి ఘన తంత్రం బెల్ల సద్యోఫల
ప్రదముల్గా విలసిల్లె; శైలసుత గర్వంబెల్లఁ జల్లారె, నా
రదుఁడన్నం గలహాశనుండనగ, సార్థక్యంబు చేకూరెఁగా.

ఇప్పు డీమెతో సంభాషింపవలయును.

(సమీపించును.)

పార్వ—(చూచి) అయ్యయ్యో ! ఈ నారదుండును సమయమునకే వచ్చుచున్నాఁడు. నే నిప్పు డీతని మొగమెట్లు చూడఁగలను! ఏ ధైర్యము వహించి యీపాడు గంగపైఁ బంతమాడఁగలను. నేటికీగంగ కోడిపోవలసివచ్చెనుగదా !
నార—అమ్మా ! స్వామివారు మరల మూర్ఛాగతులయిరా యేమి?
పార్వ—నారదా ! వచ్చితివా ! ఇటు కూర్చుండుము,
నార—తల్లీ ! పార్వతీదేవీ ! ఇదియేమి ? ఈశవ మెవ్వరిది ?
పార్వ—(దుఃఖముతో) నారదా ! నాగతి నేమని చెప్పుదును ?

ఆ. తపముచెడకయుండఁ దనయునిసృజియింప
నెఱుఁగ కతని నాథుఁ డిలనుఁ గూల్చె
ధవుఁడుమూర్ఛనందె; తనయుండు మరణించె
నేదిదారి సంయమీంద్రనాకు ?

నార—తల్లీ ! కేవలముపెట్టిపట్టుదలఁబూని గంగావిరోధంబున నింత తెచ్చుకొంటివిగాని, యిదివఱకే, నీవు గంగావతరణంబున క

నుమతించియుండిన నింతపుట్టియుండకుండునుగదా! ఈతపములేల? ఈజపములేల? ఈతాపములేల? ఈశాపములేల? అంతయును నీ స్వయంకృతాపరాధముగాక, మేమెవ్వరమేమి చేయగలము!

పార్వ—నారదా! నాకుమారుడెట్లు బ్రదుకును. నానాథు డెట్లు జీవించును?

నార—అశ్వినీదేవతల నడుగ లేకపోయితివా?

పార్వ—ఆ యాశకూడఁ దీర్చుకొంటిని. జాములోపల గంగ నీమహేశ్వరుని శిరముపైనుంపకుంటిమా విగత జీవుండగునని యానతిచ్చిరి.

నార—అట్లు వారుసయితము చెప్పిరా! ఇఁకనేమి? అపాయమే కాచుకొనియున్నది. మీ రింకనైన పంతముమానవలెను. గంగతో మైత్రియే మీ కిఁకకర్తవ్యము!

పార్వ—నారదా! నన్ను శౌర్యహీనురాలిం జేసి, గంగ నధికురాలిగావించి, మీ రందఱును మహాతంత్రమును జేసితిరి. ఏదిక్కుఁజూచినను, నిస్సహాయనై యున్నందున, నన్నిప్పుడు నిర్భయముగ నీవు గంగావతరణమున కనుమతింపుమని పలుకుచుంటివి! జగద్ధిత మభిలషించి నానాథుడు విషపానము చేయగా దేవత లందఱుం దమకుగానిచందమున నూరకుండిరి, ఇది వారికి తగునా? కష్టదశయందున్న నాప్రతిజ్ఞను భంగముచేసి నాకు సవతిం దెచ్చి, నాపతిశిరంబున నుంపదలతురా! నన్నిన్నివిధముల నన్యాయము చేయుదురా?

నార—అయ్యయ్యో! ఎంత వెట్టితల్లివమ్మా! ఈ న్యాయాన్యాయములమాట నట్లుంపుము. తొలుత నీభర్తమాట, కుమారుని మాట చూడుము. అశ్వినీదేవత లిచ్చినజాముసం దర్ధభాగము గడచినట్లున్నది.

పార్వ—ఔను. నారదా! నే నిప్పు డేమిచేయుదును.

నార—చేయఁదగినది చెప్పెదనుగాని, మీరు వినరేమోయని భీతి

గల్గుచున్నది.

పార్వ—ఇట్టిసమయమున నాతో నిష్ఠురోక్తు లాడెదవు నారదా!

నార—అట్లయిన మారుబల్కక గంగను, నీపతిశిరమునం దుంచి బ్రదికించుకొనుము.

పార్వ—ఆహాహా! తుదకు నాకెట్టిదుర్గతి గల్గినది.

నార—అమ్మా! నీ కెవ్వ రేమిచెప్పగలరు! మరల మొదటి పాఠంబునకే వచ్చితివి?

పార్వ—రాను! నారదా! రాను. ఊరకే నా సంతాపమున నట్లనుకొంటిని. అట్లయిన నాపుత్రుడు నయితము గంగమూలమునఁ బ్రదుకునా?

నార—ఆయుపాయములెల్ల నారాయణుఁ డెఱిఁగింపఁగలఁడు. నీవిప్పుడాయనను శరణు వేడుము.

పార్వ—(చేతులు జోడించి)

> గీ. భక్తమానసమందిర! పరమపురుష
> శేషశయన! నారాయణ! సారసాక్ష!
> నమ్మియున్నాను మది ని న్ననంతరూప
> దర్శనం బిమ్ము నాదు సంతాపమార!

[విష్ణువు ప్రవేశము]

విష్ణు—కుమారీ! పార్వతీ! చింతింపకుము! నీకు దీర్ఘసుమంగలీత్వము గలుగుఁ గాక!

పార్వ—(నమస్కరించి) దేవా! గర్వమతినై, నే నిదివఱకు చేసిన యపరాధశతంబును మన్నింపుము.

విష్ణు—బాలా! నీవు పశ్చాత్తాపముచేఁ బవిత్రురాలవైతివి! ఏమంటివా?

> గీ. ప్రవిమలాంచిత భక్తవర్గంబునందుఁ
> డెందము లయింపఁజేతు నమందరీతి
> నంతకన్నను సంప్రీతి యగును నాకు
> దీనగతిని బశ్చాత్తప్తమైన మనసు.

నీవు పొందిన గంగావిరోధంబున కిప్పుడు పశ్చాత్తాపము నందితివి గావున, నీవు నిర్దోషివైతివి !

పార్వ—జగన్నాథా! నే నింతకాలమునుండియు గంగను దూషించితినిగదా! ఆమె నన్నిపు డనుగ్రహించునా ?

విష్ణు—నా యానతిమైన వెనుక మారు మాటాడఁగలదా ? గంగా! నీ విటురమ్మా.

[గంగ ప్రవేశము.]

గంగ—జనకా! నమస్కారము.

విష్ణు—గంగా! నీకు శుభంబగును.

పార్వ—(గంగనుఁ గౌఁగిలించుకొని) చెల్లెలా! నా సాహసవాక్యములను క్షమించి నాకు పతిభిక్షయు బుత్రభిక్షయుఁ బెట్టుము.

గంగ—అక్కా! నా యపరాధమునుగూడ నీవు మన్నింపుము.

నార—ఆహాహా! గంగాగౌరులు సదయహృదయులై యాలింగన మొనర్చుకొను టెంతకాలమునకుఁ గన్నులబడియెను.

శంక—(లేచి) దేవీ! దేవీ! చక్కని నిద్దురబట్టినదిసుమా!

పార్వ—నాథా! కన్నులుదెఱచి చూడుఁడు. మన కవశ్యము పూజనీయుఁ డగు శ్రీమన్నారాయణమూర్తియు, నారదమౌనియు వచ్చియున్నవారు.

శంక—నారాయణా! నమస్కారము. నారదా! సేమమా!

విష్ణు—శంకరా! పాపనాశంకరా!

గీ. గంగ సాన్నిధ్యమునునీవు గనుటచేత
తాపమంతయు నిప్పుడు ప్రస్థానమందె
ననవరతము గంగాధరుఁ డగుదు వేని
పడయఁజాలవు గరళతాపంబు నీవు.

భగీరథుఁ డనురాజర్షి నీకొఱకై ఘోరతపంబు సల్పుచున్న వాఁడు. నీ వాతని కభయంబిచ్చి యాతనిసన్నిధి నీగంగను శిరము దాల్చుము.

శంక—మహాభాగ్యము.

నార—స్వామీ! పంకజాక్షా! ఈశంకరుఁడు విషతాపమున నున్మత్తుఁడై పార్వతీమానసపుత్రుండగు విఘ్నేశ్వరుని వధించెను. ఇందులకు పరిహారమేమి?

విష్ణు—అందులకై నీ విపుడేచని, యేప్రాణి యుత్తరముఖంబుగ శిరంబిడి నిద్రించుచుండునో యాప్రాణిశిరంబును దెగగోసి కొనివచ్చి, యీవిఘ్నేశ్వరుని దేహంబున కదికింపుము. గంగాజలంబు చల్లినంతనే యితఁడు జీవింపఁగలఁడు.

నార—చిత్తము, (నిష్క్రమించును.)

విష్ణు—శంకరా! నీకింక నీగంగాగౌరు లిద్దఱును భార్యలగుదురు.

గీ. అరసి యొకసతి కర్ధదేహంబు నీవొ
నంగినాడవు రసికత సంతరించి
యిపుడు రెండవసతిని మహేశ నీవు
శిరమునం దాల్చుమయ్య! భాసురముగాగ.

శంక—ఇదియంతయు నీకటాక్షము!

విష్ణు—గౌరీ! నీకు గంగపై నాగ్రహము తగ్గెనా?

పార్వ—మహాత్మా! నామాంగల్యమునే నిలువఁబెట్టిన యీమహాత్మురాలికి చిరదాస్యము చేయుమన్న జేసెదను.

విష్ణు—గంగా! నీకు పార్వతిపై నింకేమైన మాత్సర్యముగలదా?

గంగ—దేవా! నాకొకనాడుగలిగియుండెనా?

విష్ణు—అట్లైన మీ రానందముతోఁ గౌఁగిలించుకొనుఁడు.

గంగ—
పార్వ— } (ఒకరినొకరు కౌఁగిలించుకొందురు)

(అనుబంధము ౨ర.)

[నారదుఁ డేనుగుతలతో ప్రవేశము]

నార—దేవా! ఒకయేనుగు యుత్తరాభిముఖముగ పరుండియుండెను. దాని తలదెచ్చితిని.

పార్వతి—అక్కటా! నాకుమారునకు గజముఖమా!

విష్ణు—విధినిర్ణయ మెట్లున్నదో యట్లగును. నారదా! నీ వీశిరంబును

విఘ్నేశ్వరునిశరీరమున కదికింపుము. గంగా! నీజలంబులతో నాతనికి బ్రాణదానముచేయుము.

నార—(శిరము నదికించును.)

గంగ—(జలంబులు పట్టి) జగద్రక్షకుఁ డగు నారాయణునికృపచే విఘ్నేశ్వరుఁడు పునరాగతజీవనుం డగునుగాక! (చల్లును.)

విఘ్నే—ఆహా! ఎంతనిద్దుర! ఎంతనిద్దుర!

పార్వ—నాతండ్రీ! నాకన్నతండ్రీ! జీవించితివా! నాకొకముద్దిమ్ము నాయనా!

(ముద్దిడుకొనును)

నార—విఘ్నేశ్వరా! నీమాత లిద్దరకును, నీ తండ్రికిని, శ్రీమహావిష్ణువునకును నమస్కరింపుము.

విఘ్నే—వారితోపాటు పూజ్యులగు మీకును నమస్కరింతును.

(అందరకును ప్రదక్షిణనమస్కారములు చేయును.)

విష్ణు—గంగాగౌరులారా! మీరు మీపతితో సుఖముగానుండుఁడు! ఈనాఁడే చని భగీరథప్రయత్నమును ఫలింపఁజేయుఁడు.

గంగ
పార్వ } భాగ్యము.

నార—ఈ గంగాగౌరీకలహనాటకమున నారాయణుఁడేమితంత్రము చేసెనో కాని, బద్ధవైరులగు వీరిద్దరకును పరమమైత్రి ఘటిల్లెను ఓడినవారెవ్వరో గెలిచినవారెవ్వరో తెలియుటయే లేదు.

శంక—నారదా! తిరిగి పురికొల్పుచుంటివి. కలహములతో నీకింకను గడుపునిండ లేదా?

పార్వ—ఔను. ఈనారదుఁడే మాకలహములకుఁ గారణము.

గంగ—ఔను. నారదుఁడే కారణము.

నార—పోనిండు- నన్నుదూషించినను, మీ రానందముతో నున్నఁ జాలును.

విష్ణు—మే మొకమారు మీమువ్వురకును మంగళాశాసనముఁ గావించెదము. పిదపభగీరథతపోవనంబున గంగావతరణము గల్గుగాక!

(అనుబంధము ౬౯.)

(తెర ప్రాలును.)

(భగీరథుఁడు తపమం దుండును. శంకరుఁ డాకాశమునకుఁ జూచుచుం డును. ప్రక్క నంది నానుకొని పార్వతియుండును.)

భగీ—(చేతులు జోడించి) దేవా! మహాదేవా! చిరకాలమునకు నీకు నాపై ననుగ్రహము గలిగెను. నాపితరులవెతలు తొలంగెను. దేవా! రమ్యవారితరంగయగుగంగను జటాజూటంబున నిలిపి, పిదప సమభూములఁ బ్రవహింపఁజేయుము.

(అనుబంధము ౭౦.)

(గంగ దిగుచుండును.)

శంక—గంగా! నిన్ను నాజటాజూటంబున ముడిచితిని. నీ వింక సమభూములం బ్రవహించి భగీరథునిపితృదేవతలను స్వర్గప్రాప్తులం జేయుము.

గంగ—భాగ్యము.

(భూమికి బ్రవహించును.)

భగీ—గంగాభవానికి జయ్!!—

(మంగళం.)

శ్రీ గంగావతరణ నాటకము

సంపూర్ణము.



*

శ్రీరస్తు.

# పార్వతీగర్వభంగము
అను
# గంగావతరణము

## అనుబంధములు.

౧. పార్వతి చెలులు కలసి,

బ్యాగ్—తిశ్రగతి.

అందరు—పావనంబగున్ ఈవనసేవనంబిలన్ ॥ పావ ॥

1 చెలి—మల్లెలు మొల్లలు మంచిచామంతుల మందముగా వీచు
నెత్తావులూ । కొల్లలుగాబారు సెలయేళ్ళమొత్తము । లల్ల
నల్లనదోచు హరిణచయంబులు ॥

అందరు—పావనం.

2 చెలి—అచట నేమివెలసెనే?

3 చెలి—ఇచట నేమిగాంతురే?

4 చెలి—విచలదమలతరంగిణిని గంగను బొడగాంచరండు॥ పా ॥

౨. పార్వతి.

బ్యాగ్—ఆదితాళము.

(రుకిఆయిూఅబరియావలె.)

కడుపవిత్రమగు । గం । గానదమున్ । పావనమా । శుభసేవ
నమా॥ క ॥ శ్రీకరగంగా శివజలములసే । వించినపాపములెల్ల దొల
గుగా । గురుతరపుణ్యము చేకురుగా ॥ క ॥

3. గంగ—బ్యాగ్—ఆది.

రావలదిటు రావలదిటు హిమగిరిపుత్రీ । కమలనేత్రి సుగుణ
వర్తీ । శుభదగాత్రీ । సమలినసమయమునను ॥ రా ॥

శాంకరి నీపీ కరణినిసలుపగ । సుకృతమంచుదలచితివో । ఛా

లఘోరమహా నకార్యమంచును సురలుదలపపరిభవమహా। జాలమిఁ కేలా సరగునబాముని । సలిపెదనతులను సుదతీ॥ రావ ॥

౪. జైలాగు—మోహన—రూపకం.

పార్వ—చాలుచాలునీపలుకులు నీయలుకలు నీరజముఖి । నామహాత్మ్యమే తెలియవు॥ చా ॥

గంగ—హరుమదవతినని మదమున నహంకృతిని మెలగగా । వెరపున జనుటకు సురనదివెడగని తలపోతువా ।

ఓమహా పాపినీ ! కోపినీ !

పార్వ—అడలవుగా !

గంగ—వెడలవుగా.

పార్వ—గెలిచెదవా ?

గంగ—గెలతునే.

౫. గంగ—బ్యాగ్ ఆరుఅక్షరములతాళం.

హిమగిరీంద్రతనయా । పో । పొమ్మతోలుదోలుతన్ ॥ హి ॥

1 భవహరుసతినని భ్రమసితివో । ఇఁకనేమని మదిదలచితివో । దురంతమహా । ఫలం । బగున్ ॥ హిమ ॥

2 హఠమున నను దెగనాడెదవా । పటుతరపరుషము లాడెదవా । మహా । రణం బగున్ । సుమీ ॥ హిమ॥

౬. నారదుఁడు. శ్రీరాగం—తితాల్

భజభజమారుతినుతనామ । కోదండరామ॥ భ॥

అజరుద్రసురేశకిరీటాలంకృతమణిమండిత । చరణకమలయుగళ శశివిభాకర శ్రీకరలోచన॥ భ॥

సుజనాభయశంఖచక్రశార్ఙ్గగదాలంకృతకర । శ్రీవత్సాంకాంచిత తను సేవిత ! సనకసనందన॥ భజ॥

౭. నారదుఁడు- కాఫీరాగం—అదితాళం

మంచిచిత్రమగునాటకమునా । డించువాఁడసరిగా । సొగసుగా! మం॥ గంగాగౌరులనుపాత్రలజేసి । కలహాంకురమను । నాందిని బాడి । హాస్యరసంబె ప్రధానముజేసి । హరునికథానాయకునిగజేసి।

(త్రిశ్రగతి) భగీరథప్రయత్నంబు నాధారంబుగ గైకొని। ముదమునొస గుగంగావతరణరంగమునుంగాంచి। కలహామునుభుజించి। బ్రహ్మానంద మనుభవించి॥ మంచి॥

౮ గంగ - హింఢోల్ — ఆదితాళము.

ప్రతిజ్ఞాభారమెటులదీరునో॥ హృదయపరితాపం బెటులారునో॥ ప॥ మూఢతచేకురక। ముందువెనుకఁగనక । గాఢముగాపరిభవిం చితిగౌరిని। అభిమానంబున నాడితిగా యిటు। లాత్రిగలిగె నిపుడేమి చేయుదును॥ ప్ర॥

౯. నారదుఁడు- మాయామాళవగౌళ — చతురశ్ర.

భజగోవిందం। భజగోవిందం। గోవిందంభజ మూఢమతే॥భ॥ సంప్రాప్తే సన్నిహితేకాలే నహినహిరక్షతి డుకృఞ్కరణే॥ భజ॥

౧౦. గంగ- మోహన — ఆది.

దయాభరణ। నయాచరణ నీదయచే। భయార్తుల్ హారి। పగ ధృతిగంటిని॥ ద। చరాచరములకు। ధరాధరములకు। సురాసురుల కును। పరాత్పరుండగు। వరకృపాంబోధియగునారాయణు । చర ణాంబుజామృతాస్వాదనమున॥ద॥

౧౧. పరిజనులు- నాయిక — ద్రుపద.

జయజయరాజాధిరాజ। దయాశరధి। భాగీరథి। జయ॥ శ్రీ లున్। ఆయురారోగ్య। శ్రేయముల్। చిరంబొసగుచు। శ్రీనాధు డుబ్రోచుగాత। చిరాయుష్యంబులుగలుగ। శ్రితార్తిపాలుండవగుచు॥జ॥

౧౨. నారదుఁడు- కాఫీ — ఆదితాళం

ఓభగీరథావినుమా॥ ఓభగీ॥ నీదుపితలుపడువెత। యమపుర వరమున। భయకరముగ। ప్రకటితహతముగనో॥ భగీ॥

యమునిభటులుకడుహతంబుమీరన్ । చటులవిమతహరకా ర్యమునర। అనుదిన। మునుకడు। నిడుములువడగను। సలిపెదరిఁక నో॥ భ॥

౧౩. భగీరథుఁడు- హింఢోల్ — రూపకం.

చేరిరాయమునిపురంబూ। నాదుపూర్వులోమునీంద్రా॥ చే॥

భీకరయమయాతనముల । వెతలబడి । కడుతడబడి । నాకులమువినా
శముగా । నెటులన్ । శ్రమజెం । దిరో కో॥ చేరి॥

౧౪. భగీరథుఁడు.

సారంగ—కురుజంపె

హితులార । సతులార । యమపురవిషయముల । చెవులార
నాలించి । తిరిగాద। విశదముగ॥ హితు॥

గతిలేనినావారు । కడునిడుములనుగుడువ । విమలాత్ముకరణిని
టు । సలిపితినఘంబులను॥ హితు॥

౧౫. నారదుఁడు- కళ్యాణి—ఆది.

శ్రీరమాహృదయలోలా । నీరజాన్వితవనలోలా । శుభగుణ
జాలా । వినుతచరిత్రా । విధినుతా॥ శ్రీ॥ విబుధవినుతచరణా । సుమ
హిత సురహితకరుణా । భువనపాలనా । శశిదినకరత్రిశత నయనా ।
నీరజనయనా నిర్మలచరితా । నిజహితభరిత॥ శ్రీ॥

౧౬. భగీరథుఁడు- బ్యాగ్—ఆది

ఓహో ...కనే । నిలువకచనిమొదగా । రయముగా॥ ఓ॥

ఇలగలిగిన ధరాధీశ్వరులు విస్మయానుమతులైమతులదరన్।వి
మలంబగువం।శమహీశ్వరులీ।కరణిన్ వెతలన్ గుడిచిరిగా। నే॥ ఓహో॥

నిరతతపంబునొనర్చెదన్।నిజార్యులకుసం।తసమిడెదన్ । భగీర
థుం।డనుయశముఁ । దిశలెల్లనునిం।డగ।నగణితముగ॥ నోహో॥

౧౭. భగీరథుఁడు- వాచస్పతి—రూపకం.

లోకమాత । శైలసుతా । శ్రీకరగంగా॥ హేలోక॥

1. కరుణాకరి,పరమేశ్వరి।ఘనశైలకుమారికా।గురుకృపాకరీ॥ హే॥లోక
2. కులపావని।ఫలదాయిని।వాచస్పతివందితా।ప్రకృతిసుందరా
హే॥ లోక॥

౧౮. భగీరథుఁడు—(హాయిహై గిరిజాభవానీవలె)

పాహిమాం । గంగాభవానీ । శాంతనిలయే । శ్రీకరీ । పా॥
నిర్గుణీ । చిద్రూపమాయా । విశ్వజనసంభావనీ॥ పా॥
శుభకరీ । మహాగుణధీరాత్మా । శుభసంధాతా । నగసంజాతా

ఓ బీజాక్షరీరూపజననిరో । తరంగనిర్మల నిక్షేపా॥
నిర్గుణీచిద్రూప మాయావిశ్వజనసంభావనీ॥ పాహి॥

౧౯. గంగ—(దాదర దిల్‌దారీ తాదారీతో౦వలె)

భూతలనాథా సంతోషంబుగ । చనుమా । భవహరుని । గన్గొనుమా । వేగముగా । నో॥ భూ॥

శ్రీకరమగా నాకైలాసంబున । జేరంగాబోపోమ్మా భూపా । భూపాలేశ్వరా । మోదము నీకీకన్ । గలుగుప్రీతిగా । శ్రీదంబుగా కడువీక॥ భూత॥

౨౦. భగీరథుఁడు.

౧౮. అనుబంధమే తిరిగీ పాడుకొనవలెను.

౨౧. గంగ- సారంగ—ధ్రుపద.

సర । సిజ । నిభ । సువదన । సురాధిపతివినుతా॥ సర॥
సురుచిరాంగ । కృపాపాంగ । పరమహిమాన్వితవిగమన॥ సర॥
నిరుపమానవిలాససుమహితకర । కరుణాన్వితహితజననుత॥స॥

౨౨. గంగ- సురట—త్రిశగతి.

నిరుపమ శ్రీకాంతామనోహరా । సకలలో । కములుగా। పాడెడుహరి॥ నిరు॥

శూలపాణికోమలినై సుందరి నిలచెదననుచున । పావనియగు పార్వతితో । శ్రీనాథా పలికితివట॥ నిరు॥

నా యధైర్యమునుహరించి । నను ప్రేముడిగారవించి । పాయక నాకభయమొసగి । పాలించుము నారాయణ॥ నిరు॥

౨౩. విష్ణువు- శ్రీరాగము—రూపకం.

ఇదె గంగాతోయముగొనుడీ । ఆఅఅఅఅఅ॥ ఇదె॥

కుదురుగమీమానసములకును ప్రమోదమొనగూర్చెనుసిదె॥
సదమలమిది సద్విలాసమూ। నాపద । కం । జాతంబుల నణఁగియుండె నప్రమేయ మతిశాంతము । సుప్రసన్నమఘహారము । మానితముగ మీవిమల క । మండలోదకంబులఁగొను॥ డిదె॥

౨౪. బలిచక్రవర్తి- బ్యాగ్—రూపకం.

భీతినిబొందకుఁ డింకని । శాతకృపాణంబులనరి । వ్రాతంబువధింపుడసురులారా॥ భీతి॥

పాతకులనెల్ల । బరిమార్చి । పసదూల్చి । భజింపరే । ధృతిమీర॥ భీతి॥

౨౫. నారదుఁడు-మోహన-చతురశ్ర.

జగ।ములకధిపతినీవే॥ జగ॥

జగములు। నగములు । జంతుజాలములు । నిగమములును సకలమునీవే । నరసురగరుడులు । నసురులునీవే । జనపద నానావనతతి నీవే ధరణీ।నభతారలునీవే॥ జగ॥

౨౬. దేవతలు - బ్యాన్—త్రిశ్రగతి.

శ్రీధరా । సుగుణాకరా । అఘసం । హరణా । నుతగుణా॥ శ్రీ॥ దీనులమముకృపజూడన్ । రావే । మంగళరూపబ్రోవఁ । కనవే వినవే । యరయవే॥ శ్రీధ॥

౨౭. దేవదానవులు - మోహన—కురుజంపె.

తరచరే క్షీరాబ్ధి । యోసురాసురులార । తరచరే మీమనస్థైర్యంబుమీరగా॥ త॥

ఒకవంకసురలువే। రొకవంకనసురులును। ప్రకటితంబుగవాసుకినిత్రాటిగాబట్టి॥ త॥

౨౮. (పైవరుసనే) దేవదానవులు.

కటకటామందరనగంబు వారధిమున్గె । పటువేగమునదాని బెకలింపఁజూడరే॥ తర॥

౨౯. అందరు.

క్షీరసాగరఅఅఅఅఅ॥ క్షీ॥

సుగభీరా । సువిచారా । నగధీరా । మణిహారా॥ క్షీ॥

మంగళకర గురుశీలా । సంగతగుణ గణజాలా । సుజనపాల। గానలోల । దాసావన। రమారమణ॥ క్షీర॥

౩౦. (౨౭-వరుసనే—దేవదానవులు.

ఘనవాసుకిఫణంబులను బట్టరే వేగ । సదమలసుధారసము, సమకూర్పరేమీరు॥ తరచ॥

౩౧. పార్వతి-బీన్‌ఫలాస్—త్రిశ్రగతి.

జగన్మంగళంబునీకు సలుపుటఘనమీశ్వరా, సలుపుటఘనమీ శ్వరా॥ జగ॥ బాలవిసంబుగ హాలాహలమును పానముజేయుము శూలధరా । విడువవలదు । వెరువజనదు । వేల్పులకుహితంబుగా । వేల్పులకుహితంబుగా॥జ॥

(సాకె) ఫాలనేత్రాభీలాజ్వాలా విలాసుండవీవూ । కీలికీలానల్పజ్వాలా వినోదుండవీవూ ।

(మిశ్రము) మోహానకరుణాలోలా । గుణజాలా । శుభశీలాఫణిమాలా॥ జగ॥

౩౨. శంకరుడు- బ్యాగ్—రూపకం.

హేలాగతి నీక్షణంబుహాలాహలచుంబనంబు । లీలగ సలిపెద దేవతలారా॥ హే॥

తమకం । బునమీ । తనువులు । రక్షించెదన్ । విషమున్ । కబళంబుగనే । భక్షించెదన్ । దీనతమానుడు । ధీరతబూనుడు । చింతింపగనేటికి । శాంతింపుడీ! హేలా॥

౩౩. నారదుడు--కన్నడ—తితాల్.

శ్యామసుందరశుభాంగ । శుభగా । నుతమభాంగ జగదీశభుజగా ॥ శ్యా॥ లలితరాగకళలన్ వినవుగా॥ శ్యా ॥

స్థిరముగామహతీస్వననాదము । సుఖముగావినరా సుకుమారా । సకలలోకభరితా శుభచరితా । లోకనేత । మోక్షదాత । నిరత ॥ శ్యా ॥

౩౪. శంకరుడు—బ్యాన్—ఆది.

దురాత్ములనునా । పరాక్రమంబున । నిరాటంకముగ । బోకార్తున్, సురాధిపతులకు । శుభంబుగూర్చెద । సుఖంబుబేర్చెద । వెతదీరున్ ॥ దు ॥

ధీరతచే । ధీరోదారతచే । భయదాకారతచే । లుంఠనముం బొనరిం
చెద । లోకంబులు జీకాకుపడన్ ॥ దు ॥

3౫. డైలాగు—మోహన—త్రిశ్రగతి.

చెలు—ఓరీ పింజారీ మితిమీరీ మర్యాదారీ । దెచ్చుకారణంబదేమీ॥
ఓరోరీ॥ పారిపోకు మిపుడునిన్ను బట్టికట్టి కొట్టెదము—
భృంగి—.....................తాళ్...తాళ్
చెలు—పారిపోకు మిపుడునిన్ను బట్టికట్టి కొట్టెదము ।
ఓదురాత్మ । రూఖలాత్మ । పరిహాసమా॥
భృంగి—ఓసిముండలార మీకు రోసమేల నిలుఁడు నిలుఁడు ।
చెలు—దుష్టుఁడా । భ్రష్టుఁడా । దుర్మదంబురా ॥ ఓరీ ॥

3౬. చెలులు—భృంగి—డైలాగు—బ్యాన్—రూపకం.

చెలు—సిలతురేమి । నెలతలార । నీచునితనిబ్రహరింపక ॥ ని ॥
పలువిధముల బరిహాసింప । పడతుల మము నిటజేర్చెను॥ ని ॥
పార్వతీ సఖుల మటంచు। భావమం దెఱుంగఁడే । గర్వమతిని।
వీనిబట్టి । ఖండింపుఁడు—దండింపుఁడు ॥ ని ॥
భృంగి—తాఘూ—ఇఁకచాలూ । కడుమేలూ । మీగోలా॥ నన్ను
తంటాలుబెట్టకుడే ముండలారా ?
చెలు—॥నిలతు॥

3౭. చెలులు—శంకరుఁడు—డైలాగు—బ్యాన్—ఆదితాళం.

శంక—గతాసులుగ మిము త్రిశూలధారల। గారింతును బానిసలారా॥
గ॥ హితాహితంబుల నెఱుంగకిటు దు । ర్మతిన్ వహింతురె ।
ధృతిమీర ॥ గ ॥
చెలు—మాపై నేటికి కోపము జెందగ । మముర క్షింపుము శూలధరా।
భృంగి—కామహరాయీ । గయ్యాళిముండల కనికరింపకుము కసి
దీరా ।
చెలు—నీకెంతకన్నులు తలకెక్కెరా। నీపసజూతు మిప్పుడు తాళరా।
శంక—గతా......

౩౮. చెలులు—బీన్‌ఫలాస్—త్రిశ్రగతి.

ఆ । ఆ । ఆ । ఆ । సుమనవినుత । సుగుణభరిత । ఆ ॥
కలుషభరవిమోచనా । కమలనిభ సులోచనా ।
సలలితాంగ । కృపాపాంగ । సదయహృదయ । సుమహిత
మయ ॥ ఆ ॥

౩౯. చెలులు—బీన్‌ఫలాస్—ఆటతాళం.

ముల్లోకమోహినికి నుయ్యాలలో ।
సల్లాపవాహినికి జంపాలో ॥ ము ॥
ఫుల్లాబ్జలోచనకు । భూభారమోచనకు ।
కల్లోలవాహినికి నుయ్యాలజంపాల॥ ము॥
మంగళాంగకు మహామహిమాంతరంగకును ।
రంగచ్ఛుభాంగకును । ఉయ్యాల జంపాల॥ ము॥

శంకరుఁడు- బ్యాగ్—త్రిశ్రగతి.

వలదువలదు చనగవలదు మోహినీ । కరుణగనుము మనవి
వినుము॥ వ॥ విరిశరములు నాటెనే । మరుఁడిటు కనుగీటెనే ।
విడువజాల । వెతలికేల । కమలనయన । విమలవినయ॥ వ॥

౪౧. మోహిని- బ్యాగ్—త్రిశ్రగతి.

చనుముచనుము వదలిచనుము శంకరా । హితమువినుము ।
ధృతినిగనుము॥ చను॥ పరసతులను గవయుటా । పాప మిటుల
భ్రమయుటా । బలిమిమీర । గవయమేర । హితమువినుము
ధృతిని గనుము॥ చను॥

౪౨. శంకరుఁడు- (సావలియానుమారోరే వలె)

మోహినియానుమాయురే యీా । ముదితనుగనగా॥ మో॥
(సాకె) పురంధ్రీలోకమునా । ఈభువనలావణ్యమోహినీ-
(మిశ్రము) యేనారీలలామ సాటియా । నీమోహినియెదుటా॥
మో॥

౪౩. శంకరుఁడు- ౪౦ వ అనుబంధమే పాడుకొనవలెను.

౪౪. నారదుఁడు- కేదార—ఆదితాళం

కడువిచిత్రమగుగా । విమల గంగావతరణ చరితమూ సుమ
హితము॥ క॥ పార్వతీబహుళ గర్వవినాశము సర్వేశ్వరమహి
మా విలాసమూ । సురాపగాబంధురవిలాసమూ । మహితమై
బహుతరాద్భుతమగుఁగా॥ కడు॥

౪౫. శంకరుఁడు- బ్యాగ్—త్రిశ్రగతి.

ఆహాజగన్మోహినీ । మరపించిపోయె॥ ఆ॥ పోవునప్పుడు ఆపా
లతి కీల్జడసొంపు । భావజుకటారియయ్యోగా । పిరుదుల యం
దంబు చందంబు డెందంబలరించెగా॥ ఆహా॥

౪౬. మోహిని-౪౧ వ అనుబంధమే పాడుకొనవలెను.

౪౭ & ౪౮ శంకరుఁడు ౪౦వ అనుబంధమే పాడుకొనవలెను.

౪౯. సాగరుఁడు.

హరహర త్రిపురాంతకా । అఖిలలోకనాయకా॥ హ॥
పరమానందా ప్రమేయభవహర । భవహర। భవహర॥హర॥
కరుణాసింధూనీపద । కమలములే స్తుతియించెద । ధ్యానిం
చెద । కీర్తించెద । దయదలపుము । అనవరతము॥ హర॥

౫౦ నారదుఁడు- మోహన—ఆటతాళం.

గోవిందా । చిదానందా । పతితపావన । ఆఅఅఅఅఅ॥ గో॥
దేవాధిపతినుతచరణా । దైత్యసంహారణా॥ గో॥ భక్తపాలన ।
ముక్తిలోలన । శక్తిచాలన । గుణధనా॥ గో॥

౫౧. నారదుఁడు- మోహన—ఆది.

గోవిందా గోవిందా గోపాలరాధారమణ॥ గోవిందా॥ మాధవ
కేశవకృష్ణమురారే । వాసుదేవనారాయణశౌరీ॥ గో॥ శ్రీధర
మురహరనరహరి హరీ । శ్రితపాలన మధుసూదనశౌరీ॥ గో॥

౫౨. పార్వతి- భాగేశ్వరి—ఆదితాళం

ఈవిషంబు ప్రాణనాథుజీవము లెటులఁ బాపునో ॥ఈ॥
సం । తాపమెటులనోర్చుదాననో మది । భీకరమై తోఁచు
చుండెగటకటా॥ ఈ॥

ఘోరవిషానలకీలలచేదనువు । భూరివిపద్దశనందెనుగా । ముని వరా । ధృతిన్ । భరిం । తునా నిలతునా॥ ఈ॥

౫౩. పార్వతి- శ్రీరాగము—ఆదితాళము.

ఇదిదురపా । యముగా । దోచె । నేమిసేయుదాన నారదా । అలలలలలలల॥ ఇ॥ దురితంబనక । మ । దోద్ధతింగనక । దోషమొనర్చితి నాపతియెడనే । నీకనేదారియొ యీవిద్య తీరగ । సరసగుణా । కరసుజనా । పరిభవ॥ మిది॥

౫౪. పార్వతి- మాయామాళవగౌళ—త్రిశ్రగతి.

విడవా నీపలువతనమునారదా । మానవా । భీకరినగు । శాం కరినని జగమెఱుగగ॥ వి॥ మాటికిగంగను నాపతిమహితమౌ శిరంబునన్ । నిలుపగదలచెదవలతిగ । నినుక్షమింప నెఱు గుమా । ఎంచుమా । తలంచుమా । వంచనసలుపగ జాలవు॥ విడ॥

౫౫. శంకరుడు- బ్యాన్—త్రిశ్రగతి.

నేవెఱ్ఱివాడనైతినంచు । తొఱ్ఱిమాటలాడువారి । గర్వమడచు వాడరా యరేయరేయరే - వెఱ్ఱివాడనైతినా । విఱ్ఱవీగి యుంటిరా । తొఱ్ఱిమాటలా । నే వెఱ్ఱివాడనా । గిఱ్ఱుమను చుతలను దిరుగగేలిసేతురా । నాతోడ॥ నే॥

౫౬. గంగ.

ఏలనే । చాలునే । ప్రతివచనము బలుకదగదు॥ ఏ॥ అరమర లికనేలనే । హరమునమారాడకే । యరయగ గర్వప్రమ త్తవగుట యిపుడు దెలసెనే । తెలసెనే। తెలసెనే। పలుమరు। గరువము । వలదిక॥ ఏ॥

౫౭. డైలాగు- (హావెలాకేవలె)

గంగ—మాయలాడీ । మాయలాడీ । యేమేనీవగలోహాహాతెలసె । చాలుపోవేశంకిణీ॥ మా॥

సరగునదరియరాకే । పరుషములాడబోకే । పరమనిర్భాగ్యురాలా । పాతకీ । దృతభాషిణీ॥ మాయ॥

పార్వ—పాపజాతీ। పాపజాతీ। ఓహోహోహో పలుగాకీ నీకీ వాగ్వా
దముచాలునే॥ పాప॥ తగునె నీతో డరట్టూ। పగలెచుకక్కలు
బుట్టూ। తటుకున నోరుజార। దగునటే। హతభాగినీ॥పాప॥

౫౫. గంగ—సావేరి-ద్రుపద.

అఖండపుణ్యలోకాప్తి। గలుగుగాక శుభకరముగ॥ నఖం॥
సుఖప్రాప్తిరస్తు నిరత। సురలోకప్రాప్తిరస్తు। అఖం॥
సదాముదావహాఫలోస్తు। సంతతానందమస్తు
బుధజనసంకీర్తనోస్తు। పుణ్యజీవనప్రదోస్తు॥ అఖం॥

౫౬. విష్ణువు - మాల్కౌస్—ఆదితాళం

గరువపుమాటలుపలుకగదగదిటు। గంగనుభంగము। సలు
పగజాలవు॥ గరు॥ కరమునింద్యమగు కృతమనితలపవు। హరుడువరుం
డని। యాలోచింపవు। భరమగుకార్యముపైనిడుకొంటివి। పారము
లేనివి। పద్భరమగుసుమి॥ గరు॥

౬౦. డైలాగు—మోహన, ఆది

నార—వలదమ్మా యీపంతమువిడుమా। వారిజలోచనుహితంబు
వినుమా॥ వల॥ కళవళమేటికి గంగనునీపతి। శిరముననుంచు
మీ। వాలోచింపుము॥ వల॥

పార్వ—ఇంతపంతమేలనీకిదేమిమతమునారదా। పంతగించినన్నిటు
లవమానపరుపదలచితో॥

గంగ—పూజ్యుడైన మునివరునెడ పొల్లుమాటలాడెదవా

పార్వ—వ్యాజములను బలుకదలచివచ్చితే దురాత్మురాల॥

విష్ణు—గౌరవంబుమాని పలుకకట్టిడియని యెఱుంగవే
ధీరవచనమేలనాడ దీనితోడమందాకిని॥

పార్వ—చాలుచాలునీవును చ। కట్లుదిద్దవచ్చితివా
బేలయనుచు దలచితివో। భీమణియాశాంకరిణ॥

నార—(చతురశ్ర) అమ్మా! నీవేమిటికిందర। నిమ్మాడిక్కని బాధిం
చెదవమ్మా॥

విష్ణు—(త్రిశ్రగతి) నాదుమహిమ మెఱుగకిటుల వాదులాడునారదా॥

గంగ—చూచుకొందమపుడు నా ప్ర । తాపము నీమహిమంబును ॥
నార—వలదమ్మా ॥

౬౧. పార్వతి—బ్యాగ్—త్రిశ్రగతి.

నీ కేలా । నీవూరకుండుమా । ఎంచుమా । తలంచుమా । వంచనసలుపగదలచిరి ॥ నీ కే ॥

పలువురు నేకంబయినను । పరిభవింపదలతురా । కలనైనను । నాకునింద । గలుగునటంచుదలచితివె ॥ నీ ॥

౬౨. డైలాగు—మోహాన—ఆదితాళము.

విష్ణు—చాలునింకనీపరాభవము రమ్మా సంగతిదెలసెను ॥ చాలు ॥
మేలయ్యేను వేళాకోళము । శృతి । మించిరాగధోరణింబడెను
చాల్ ॥ చాలు ॥
శంక—కరుణగనుము కేశవా । గంగనుగొని చనెదవా ।
కరముతనువునందున జీవములు నిలుచుటెట్టులో ॥
పార్వ—దానితోడ నీదుతనువు తరలునంచుదలతువా !
గంగ—పౌరుషంబు లేల నే—
పార్వ—పాపినిమారాడ కే—
గంగ—అదరు బెదరు లేకనిటులనాడకే దురాత్మురాల
పార్వ—అదరు లేల బెదరు లేల పదపదహృదయేశ్వరా ॥

౬౩. డైలాగ్—సారంగ—ఆదితాళం.

చెలు—ఊరటగనుమమ్మా నీవూ—ఓఓఓహిమగిరిపుత్రీ ఊ॥ ధీరతబూనుము । దీనతమానుము । శూరవనితకిటులగదమ్మా ।
మదిగనుమా । యిదివినుమా । మనమున ॥ ఊ ॥
పార్వ—చెలియలార తోపదేమిసేతు నిపుడు తెలుపరే । కలతవడియెగద హృదయము । కలదా । సులభం । బగుగతి ॥ ఊర ॥

౬౪, విఘ్నేశ్వరుఁడు. బ్యాన్—త్రిశ్రగతి.

ఎవఁడునన్ను గెలుచుశూరుఁ డీ జగంబులా ॥ ఎ ॥

గరువమడతు, ఖలులబాడుతు । నడతునిప్పుడే॥ ఎ ॥
(ఆది) పార్వతీసుతుఁడనేనా । పా । పాత్ముల వధింపలేనా ।
(త్రిశ్రి) నిర్వహింతు । సర్వభార । ముర్వినేలెదరా॥ ఎవ॥

౬౫ చెలులు - మోహన—చాపుతాళం

మంగళముగణపతికి । మంగళముగుణధృతికి
మంగళమచలధృతికి మంగళమహా(శ్రీ)
మంగళమనంగసమ । రంగద్విలాసునకు
మంగళము శుభమతికి మంగళమహా(శ్రీ)॥ మం॥

౬౬. శంకరుఁడు, ఖ్యాన్—ఆది

దురాత్ములనునా ॥ పరాక్రమంబున । నిరాటంకముగ । బోకార్తున్॥ దు॥ చలంబునన్ । బలంబునన్ । స్థిరంబుగా । హరించెదన్ । దు॥ శూరతచే । ధీరో । దారతచే । భయదా । కారతచే । క్రూరాచారతచే । మారునిపోలికలోకము లెల్లను । మారణముగా సలిపెదగా రయమున॥ దు॥

౬౭. నారదుఁడు-౪౪ వ అనుబంధము పాడుకొనవలెను.

౬౮. పార్వ—గంగ—కలిసి పాడునది.

కేదార—జప్ తాల్

ఆనందముననాకు । నాలింగనమునిమ్ము । నా నేరముక్షమించి । నను కరుణగాంచుమా ॥ఆ॥

చిరకాలవైరంబు । మరవదగుహృదయమున । చేసినయవజ్ఞతకు । గలిగెనుఫలముమనకు॥ ఆ॥

౬౯. విష్ణు—నారదుఁడు కలిసిపాడునది.

బిళహరి-రాగం—ఆదితాళం.

గంగాగౌరీశంకరులకు నిక । మంగళమగు శుభమగు శోభనమగు॥ గంగా॥ రంగదుత్తుంగరమా విభవముచె । లంగుగాక నంగజ

మోహానముగ॥ గం॥ వామభాగమున గౌరివసింపఁగ । సోముడు గంగ యుశిరమున జెలగగ । కామహరుండగు హరునకుసతతము । కామితార్థములు గలుగుచునుండగ॥ గంగా॥

౭౦ భగీరథుడు—౧౮ వ అనుబంధము పాట.

౭౧ మంగళహారతి.

మంధరధర మంగళకర । మంగళంబురా । మారసుందరా । శ్రీరమేశ బ్రోవరా । దాసభరణ । దోషహరణ । దానవేశనాశా । శ్రీనివాసజగదధీశా । శ్రీరమా । నాయకా । జగన్నాయకా॥ మం॥



# సరస్వతీ బుక్ డిపోవారి స్టేజీ నాటకములు

పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారివి

| | |
|---|---|
| కోకిల | 1-2 |
| సరస్వతి | 1-4 |
| వీరమతి | 1-4 |
| పూర్ణిమ | 1-4 |
| ముద్రిక | 1-0 |
| వృద్ధవివాహము | 1-0 |
| మాలతీమాల | 1-0 |
| బుద్ధబోధసుధ | 1-8 |
| పద్మిని | 1-0 |
| సరోజిని | 1-0 |
| రాతిస్తంభము | 0-12 |
| విచిత్రవివాహము | 0-12 |
| చూడామణి | 0-12 |

విద్వత్కవి మల్లాది అచ్యుత రామ శాస్త్రి గారివి

| | |
|---|---|
| ద్రౌపదీవస్త్రాపహరణము | రు 1-4 |
| భక్తచోళామీళ | 1-2 |
| కృష్ణలీల (కొత్తది) | 1-0 |

సోమరాజు రామానుజరావు గారివి

| | |
|---|---|
| రంగూన్ రౌడి (పతిభక్తి) | రు 1-4 |
| సతీసక్కుబాయి | 1-4 |
| ధరణికోట | 1-4 |
| గంగావతరణము | 1-4 |
| భీష్మబ్రహ్మచారి | 1-2 |
| సతీ అనసూయ | 1-2 |
| కాలకేతనము | 1-2 |
| ప్రతాపరుద్రీయము సో॥రా॥ | 1-4 |
| మహాభక్తవిజయము | 1-4 |
| తాజ్ మహాల్ (జహన్నారా) | 1-4 |
| భోజకాళిదాసు | 1-2 |
| సంగీత శశిరేఖ | 1-0 |

చందాల కేశవదాసు గారివి

| | |
|---|---|
| కనకతార | రు 1-4 |
| బలిబంధనము | 1-0 |
| శ్రీకృష్ణ తులాభారం సాంగ్సు | 0-12 |
| రాధాకృష్ణ సాంగ్సు | 0-12 |

జంధ్యాల శివన్నశాస్త్రిగారివి

| | |
|---|---|
| దుర్గాదాసు | రు 1-4 |
| రాణా ప్రతాపసింహ | 1-4 |

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శాస్త్రిగారివి.

| | |
|---|---|
| రసపుత్రవిజయము | రు 1 0 |
| రాణాప్రతాప్ సింగ్ | 1 0 |

ముత్తనేని వెంకట చెన్న కేశవులుగారివి

| | |
|---|---|
| చండిక | రు 1 2 |
| తులసీదేవి (సతితులసి) | 1 2 |
| శివలీల | 1 0 |
| దక్షాధ్వరం (సతీదేవి) | 1 2 |

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారివి

| | |
|---|---|
| సావిత్రి | 1 4 |

నండూరి శివరావుగారివి

| | |
|---|---|
| చంద్రగుప్త | 1 2 |

వలయు … కూరి సుబ్బారావు అండ్ సన్సు,
… తీ బుక్ డిపో, బెజవాడ.